# సోవియట్ సమీక్ష




సంస్కృతి ప్రపంచాన్ని కాపాడుతుంది

సోవియట్ యూనియన్, అమెరికాల్లోని జీవితంపై ఒక అమెరికన్ అభిప్రాయం

మహాసముద్రగర్భంలోని సంపద

మహాత్మాగాంధీపై టాల్‌స్టాయ్ ప్రభావం

# సంబంధాలు



లెనిన్‌గ్రాడ్ విద్యార్థులతో ముచ్చటిస్తున్న అమెరికన్ అస్ట్రోనాట్ జాన్‌ఫాబియన్ (కుడినుండి మూడవ వ్యక్తి), సోవియట్ పైలట్ కాస్మోనాట్ ఐ.పి. వోల్క్ (కుడినుండి రెండవ వ్యక్తి)



అమెరికా అధ్యక్షుని సతీమణి నాన్సీరీగన్, మాస్కో సమీపంలోని ప్రెదెల్కినో బస్తీలో



సోవియట్ యూనియన్‌లో బారతదేశ వుత్సవాల్లో భాగంగా చదరంగం పోటీలు జరిగాయి. ఉజ్బెకిస్తాన్ రాజధాని తాష్కెంట్‌లో భారత, సోవియట్ చదరంగ క్రీడాకారులు పోటీపడుతున్న దృశ్యం.

# సోవియట్ సమీక్ష



సెప్టెంబర్ 1 ప్రపంచశాంతి దినోత్సవం. భూమ్మీది జీవకోటిని కాపాడడం అత్యంత ముఖ్యమైన, పవిత్రమైన కర్తవ్యం ప్రజలు వేరైనా వారు ప్రపంచపౌరులే, ఒకే నౌకలో పయనిస్తున్నవారే. వారు యిప్పుడు దీన్ని నూతన స్ఫూర్తితో గ్రహిస్తున్నారు. యుద్ధంపై,ఆకలిపై, అన్యాయంపై సరికొత్తదాడి ప్రారంభించడానికి వారు ఆయత్త మౌతున్నారు. నూతన ఆలోచనా ధోరణి బలాన్ని పుంజుకుంటోంది. శాంతియుత సహకారం, విశ్వాసం, పరస్పర అవగాహన నానాటికీ పటిష్టమౌతున్నాయి. దీనర్థం, ప్రజలు తాము ప్రియమైనదిగా పదిల పర్చుకున్నదిశలో సాగడం ప్రారంభించారన్న మాట.





# ఈ సంచికలో





## 23

## సోవియట్ యూనియన్ అమెరికాల్లోని జీవితంపై ఒక అమెరికన్ అభిప్రాయం

అమెరికన్ రచయిత్రి
సరపర్గ చరిత్రకారిణి
పాలా గార్బ్‌తో
సంభాషణ

## మన అల్లకల్లోల యుగంలో సంస్కృతి ప్రధాన కర్తవ్యం. **5**

సోవియట్ సాంస్కృతిక సంస్థబోర్డు చైర్మన్ అకడమీషియన్ ద్మీత్రిలిఖాచెవ్ యీ విషయాన్ని తెలియజేస్తున్నారు. ఫొటోలో (కుడివైపు) లిఖాచెవ్, ఆంద్రీ సహారవ్



**28**



మహా సముద్ర గర్భంలో దాగివున్నదేమిటి?



**60** ట్రాయ్ మొహంజొదారోల కన్నా ప్రాచీన నగరం ఆర్కేయిమ్

దీన్ని సోవియట్ పురావస్తు శాస్త్రవేత్తలు దక్షిణాది ఉరాల్స్‌లో కనుగొన్నారు

# మనకాలపు అల్లకల్లోల యుగంలో సంస్కృతి ప్రధానకర్తవ్యం

దీమ్త్రి లిఖాచెవ్
సోవియట్ సాంస్కృతిక సంస్థ
బోర్డు ఛైర్మన్

ప్రపంచంలోని గొప్ప ఘటనలన్నీ నూతన ఆలోచనతో ప్రారంభమయ్యాయి అలాంటి నూతన ఆలోచన మానవాళిలో యిప్పుడు పెంపొందుతోందని సర్వత్రా కనిపిస్తోంది.

తానెంతటి బలవంతుడో తెలుసుకునే అవకాశం ఆధునిక మానవునికి లభించింది. అతడు విను వీధులను జయించాడు; దూర రోదసిలోకి వెళ్లి పోయాడు; అణురహస్యాలను ఛేదిం చాడు; నదీ ప్రవాహాలను మరల్చగలడు; కృత్రిమ సముద్రాలను సృష్టించ గలడు. అతడు ప్రకృతిని వశపర్చుకున్నాడు. అయితే యీ విజయం లోని ప్రమాదాలను మనం గుర్తి స్తున్నాం. మనం ప్రకృతి నియమాలను వుల్లంఘించి దాన్ని కొల్లగొట్టాం. అణుశక్తిలో ప్రావీణ్యతను సంపాదించి మనభూగోళాన్నే భస్మం చేయగల ప్రాణాంతక ఆయుధా లను పోగు చేసుకున్నాం.

ఇతర గ్రహాలపై ప్రాణులున్న జాడలను యింత వరకు విజ్ఞాన శాస్త్రం కను గొనలేక పోయింది. మన భూమ్మీది ప్రాణికోటి విశ్వంలోనే అపురూపమైన దేమో. అందువల్ల మానవ జాతినే కాక ప్రాణికోటిని రక్షించడం మన బాధ్యత.

ఈనాడు నూతనదృక్పథం, నూతన తాత్వికత రూపు గొంటున్నాయి. భూమ్మీది ప్రజలంతా రక్త సంబంధీకులే ననే భావనను, ముంచుకొస్తున్న ప్రమాదం తట్టి లేపుతున్నది. మానవాళిలో తానొక్కడిననీ, ప్రకృతిలో భాగమనీ, సంస్కృతిలో భాగమని—యెందుకంటే సంస్కృతి అంతర్జాతీయమైనది — మానవుడు నానాటికీ గుర్తిస్తున్నాడు.

మానవాళి మనుగడకోసం జరిగే పోరాటంలో సంస్కృతి నిర్వహించగల పాత్ర యేమిటి? నూతన తాత్వికతను నిర్మించి అబివృద్ధిచేసి, వ్యాప్తిచేయడం మన ప్రధానకర్తవ్యం.

"అణ్వస్త్రరహిత ప్రపంచం కోసం, మానవాళి మనుగడ కోసం" అనే మాస్కో అంతర్జాతీయ ఫోరం జరిగినపుడు ఒకరౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్న వారందరూ వ్యక్తం చేసిన అభిప్రాయమిది.

మనం యెంతో ముఖ్య మైన మార్పు ప్రాగణంలో వున్నాం. అది మన దృక్పధాల్లో మార్పు ప్రాగణం. దీన్ని మనం దశాబ్దాల లెక్కల్లో ఆలోచిస్తూ వచ్చాం. కాగా దీన్ని గురించి శతాబ్దాల, సహస్రాబ్దాల, యింకా చెప్పాలంటే సదా ఆలోచించడం నేర్చుకోవాలి. యిలాంటి పెరిస్త్రోయికా ప్రపంచ మంతటా జరగాలి.

సౌందర్యం ప్రపంచాన్ని కాపాడుతుంది. ప్రస్తుత పరిస్థితిలో నిజం అనే దానికి ప్రత్యేక అర్ధముంది. అది: జీవితం అన్నిటికన్నా విలువైనది, మనమంతా దానికి బాధ్యులం అనేవాస్తవాన్ని గుర్తించడం. ప్రపంచం పట్ల, ప్రకృతిపట్ల మనం నూతన దృక్పధాన్ని చెపట్టాలి. భూమ్మీద ప్రాణికోటి అఖండతను మానవాళి అఖండతను అర్ధంచేసుకోవాలి. మన ప్రకృతి పరిసరాలను పరిరక్షించడానికి, అణుయుద్ధప్రమాదాన్ని నివారించడానికి కొన్ని చర్యలను ధ్రువపర్చడం యెంతో ముఖ్యమే అయినప్పటికీ అవే సరిపోవు. అణ్వాయుధాల ఝళిపింపులు, ప్రకృతిని కొల్లగొట్టేవైఖరి, మానవుని జన్మహక్కుల వుల్లంఘన — యివి భయంకరమైన అమానుష లక్షణాలనే వైఖరిని సాధ్యమైనంత యెక్కువ మంది ప్రజలు తీసుకోవడం ముఖ్యం.

మన కాలపు అల్లకల్లోల యుగంలో సంస్కృతి ప్రధానకర్తవ్యమిదని నా అభిప్రాయం.

(లితరా తర్నోయ్ ఒబొజ్రెనెయ్)

## సోవియట్ - భారత సంబంధాలు : నిన్న, నేడు, రేపు



# సౌందర్యమూ విజ్ఞతల గురించిన నిజానిజాలు


ఇ.పి.చెలిషెవ్,

అకడమీషియన్, సోవియట్-
భారతస్నేహసంఘ వుపాధ్యక్షుడు.


భారతీయ ఆత్మిక సంస్కృతి చాలాకాలంగా విదేశీయులను ఆకర్షిస్తూ వచ్చింది. భారతీయులకు వుపేక్షాభావం,వాస్తవికతకు దూరంగా వుండడం, వివేచనారాహిత్యం, ప్రపంచాన్ని గురించి నిరాశావాదం లాంటి కొన్ని ధోరణులు సహజసిద్ధమైన లక్షణాలైనట్టు షొపెన్‌హోవర్ నొక్కిచెప్పాడు. అనేకమంది పాశ్చాత్యులు యినాటికీ భారతదేశాన్ని యిలాంటి భావవాద తత్వశాస్త్ర పట్టకంద్వారానే చూస్తున్నారు.

భారతీయ ఆత్మికసంస్కృతిని గురించీ, "భారతీయ విజ్ఞత" పట్ల వుద్దేశపూర్వకమైన వ్యాఖ్యానాన్ని గురించీ వూహాగానాలతో కూడిన, గాడి తప్పిన అంచనాలను భారతీయ ప్రగతిశీల సాంస్కృతిక రంగ ప్రముఖులు అనేకమంది విమర్శనాత్మక దృష్టితో పరిశీలించారు. యీ విషయంపై రవీంద్రనాథ్ ఠాగోర్ అత్యంతదృఢమైన అత్యంత సహేతుకమైన అభిప్రాయాలను వ్యక్తం చేశారని నేను భావిస్తున్నాను. భారతీయ ఆత్మిక సంస్కృతిని గురించిన అనేక వుద్దేశపూర్వకమైన తప్పుడుఆలోచనలను ఆయన విమర్శించాడు; భారతీయ సాంప్రదాయక వారసత్వాన్ని నూతన దృక్పథం నుంచీ అంచనావేసి, తనదేశంలో సలక్షణ మైన గడ్డపై పుట్టిన అందం, విజ్ఞతలలోని నిజమైన సారాంశాన్ని వెల్లడించడానికి తోడ్పడ్డాడు; భారతీయులమేధస్సు సృష్టించిన. అద్భుతమైన కృతుల్లో; ముఖ్యంగా ఉపనిషత్తుల్లో జీవితానికి సంబంధించిన చైతన్యపూరితమైన, నిర్మలమైన, దృఢమైనఅవగాహనను, మానవుని అజరామరత్వాన్ని ఔన్నత్యాన్ని ఠాగోర్ దర్శించాడు, జీవితం పట్ల క్రియాశీలంగా ప్రతిస్పందించే ఠాగోర్‌కు సౌందర్య అస్తిత్వపు సంపూర్ణ గతితర్కంతోబాటు అత్యంత సున్నితమైన సౌందర్య స్పృహ వుండేది. వుదాహరణకు, సాహిత్యాన్ని గురించి చెప్తూ, అది ఆనందానికి, భూమ్మీదిమానవుని సుఖసంతోషాలకు మూలాధారంగా జీవితసత్యాన్ని చిత్రించినప్పుడు మాత్రమె తన లక్ష్యాన్ని సాధిస్తుంది అని ఆయన అన్నాడు.

శాంతి, లోకోపకార ఆదర్శాలను ధ్రువీకరించడం, సృజనకోసం నిరంతరం తపించడం, యేవిధమైన హింసనైనా, యుద్ధాన్నైనా, విధ్వంసాన్నైనా తిరస్కరించడం అనేవి భారతీయ ఆత్మిక సంస్కృతిలో అంగాంగిక భాగాలు. ప్రాచీన పౌరాణిక, వీరగాథల్లో వర్ణించిన వీరుల, దేవుళ్ళ సాహస కృత్యాలు, వుదాత్తమైన కార్యాలు చెడుపై మంచి

అనేది విజయం సాధించి తీరుతుందనే భావాన్ని ధ్రువీకరిస్తున్నాయి; నిరంకుశులను యెదిరించి నవారిని, భూమీద్మ శాంతికోసం, సుఖ సంతోషాల కోసం వీరోచిత కృత్యాలు చేసిన వారిని కీర్తిస్తు న్నాయి భూమ్మీద శాంతి — యిది అవధులులేని ఆనందమనీ ప్రపంచంలో యింతకన్నా మించిన ఆనందంలేదనీ అధర్వవేదం వుద్ఘాటిస్తోంది. 'శత్రుత్వం, ద్వేషం అంతరించుగాక! శాంతి, శాంతి, శాంతిమాత్రమే వర్ధిల్లుగాక!' అని తైత రేయ ఉపనిషత్తు పేర్కొంటోంది. మహాభారతంలో **శాంతిపర్వం** శాశ్వతశాంతి కావాలనీ, శత్రుత్వాన్ని, రక్తపాతాన్ని నిర్మూలించాలనీ ప్రగాఢమైన విజ్ఞప్తి చేస్తుంది. మానవునికీ, ప్రకృతికీ మధ్య సమరస ఐక్యతాభావానికి భారతదేశంలో యెంతో ప్రాచుర్య ముంది; దానికి హాని చేయడం పెద్ద పాపంగా పరిగణిస్తారు. ప్రకృతి ఆరాధనా భావం భారతీయ ఆత్మిక సంస్కృతిలో సర్వత్రాకనిపిస్తుంది. యీ విధంగా, ప్రకృతితో మానవుని చెలిమిని టాగోర్ పరిపూర్ణమైన సౌందర్యంగా, విజ్ఞతగా భావిస్తాడు. ప్రకృతితో నిరంతర సాహచర్యంలోనే మానవుని నిజమైన ఆనందముందని ఆయన అభిప్రాయం; యీ ఆనంద ంలో లీనమైపోయి తనబాధలను, కష్టాలను మరిచి పోతాడు. అది మానవునికి ప్రశాంతతనిస్తుంది; వుదాత్తుణ్ణి చేస్తుంది; కొత్త ఆశలను చిగురింప జేస్తుంది. నీరు, భూమి, ఆకాశం, గాలి — వీటితో మాత్రమే మానవుని జీవితం ముడిపడివుంది కాబట్టి మనం వీటికి సన్నిహితంగా వుండాలనీ, అవసరమైతే యీ అమృతాన్ని, తల్లిపాలలాగా తాగాలనీ, ప్రకృతి ఆశీర్వాదాన్ని పొందడాకి త్వరపడాలనీ, యిలా చేయడంద్వారా మాత్రమే మనం సమాజంలో సంపూర్ణ సభ్యులంకాగలమనీ ఆయన రాశాడు. శత్రుత్వానికి, ద్వేషానికి వ్యతిరేకంగా, యుద్ధానికి, క్రూరత్వానికి వ్యతిరేకంగా ఆయన హెచ్చరిస్తూనే మానవుని పట్ల ప్రేమకోసం, దేశ దేశాల ప్రజలమధ్య శాంతి స్నేహాలకోసం, ప్రకృతి పరిరక్షణకోసం విజ్ఞప్తి చేస్తాడు. "భారతీయ విజ్ఞత"కు మూలమైన యిదంతా యీనాటి ప్రపంచానికి సుసంగతమైన సందేశం.

రష్యన్ ప్రగతిశీలురు సర్వదా యీ భావాలను, భారతీయ ఆత్మిక సంస్కృతీ ఆదర్శాలను, వాటి మానవతావాద సారాంశాన్ని పెంపొందించారు. ముఖ్యంగా లియో టాల్‌స్టాయ్ యెంతో వుత్సాహంతో వాటికి ప్రాచుర్యం కల్పించాడు. బూర్జువా నాగరి కతను తిరస్కరిస్తూ, ఆధునిక ప్రపంచంలో వున్నత నైతికతను, మంచిని, న్యాయాన్ని ధ్రువీకరించడానికి తోడ్పడగల విలువలకోసం యీ మహారచయిత భారతీయ సాంస్కృతిక వారసత్వంలో అన్వేషించాడు. టాల్‌స్టాయ్ ప్రాచీన, ఆధునిక భారతీయ తత్వవేత్త లను అధ్యయనంచేసి మానవుని ఆత్మిక సారాంశాన్ని అతని అస్తిత్వ రహస్యాల, అంతిమలక్ష్యమర్మాన్ని "భారతీయ విజ్ఞత"లో కనుగొనడానికి ప్రయత్నించాడు. భారతీయ ఆత్మికవారసత్వపు మానవతావాదంలోని మూలాంశాలను విశ్వసించ డానికి ప్రయత్నించాడు; కానీ కొన్ని హిందూ, బౌద్ధ ధర్మ, తాత్విక ఆలోచనలు ఆయనకు అంతగా నచ్చలేదు; వాటిలో అంతర్భాగంగావున్న దురభి ప్రాయాలను, మతఛాందసత్వాన్ని ఆయన తోసి పుచ్చారు. బౌద్ధమతంలో మంచికి, ప్రేమకు, శాంతికి సంబంధించిన భావాలు, సార్వత్రిక సమానత ధ్రువీకరణ, ప్రజల జీవితాలను గురించి పట్టించుకొని, సమాజాన్ని కులాలవారీగా విభజించే భగవంతుణ్ణి తిరస్కరించడం; సాటిమానవులపట్ల ప్రేమను గురించి నొక్కిచెప్పడం; హింసతో చెడుగును ప్రతి ఘటించే పద్ధతిని తిరస్కరించడం; వ్యక్తిగత ఆనందాన్ని అందరికీ మేలును సాధించడానికి ఆత్మ పరిపక్వతకోసం ప్రయత్నించడమే సరైన యేకైక మార్గంగా బోధించడం — యివి టాల్‌స్టా య్‌ని ఆకర్షించాయి.

అనేకమంది భారతీయ ప్రగతిశీల ప్రముఖులు, సాహిత్యవేత్తలు, పండితులు తమ అభిప్రాయాలను ధ్రువీకరించడానికీ, ప్రజాతంత్ర సంస్కృతికోసం పోరాడ్డానికీ టాల్‌స్టాయ్‌ను ఆదర్శంగా తీసుకొంటా రు. ఆయనకున్న తాత్విక, రసాభిజ్ఞతా వైఖరుల్లో సామ్యం కనుగొనేందుకు ఆతృత కనబరుస్తారు.

"హింసపట్ల ఆయన తిరస్కారభావానికీ, ప్రగాఢ మైన ఆయన శాంతివాదానికీ, సార్వత్రిక ప్రేమ గురించిన ఆయన బోధకూ, ప్రాచీనకాలంనుంచీ మనదేశంలో బోధిస్తూ వచ్చిన వాటికీ అనేక విధాలుగా పోలికవుంది" అని భారతీయ సాహి త్యవేత్త, ఆఫ్రో—ఆసియా రచయితల సంఘ అధ్యక్షుడు అయిన భీష్మసాహ్ని రాశారు.

''మానవుడు తన ఆత్మికశక్తులన్నిట్నీ తన కర్తవ్య నిర్వహణకోసం వినియోగించాలి'' అనే విజ్ఞప్తి బగవద్గీతలోటాల్‌స్టాయ్‌కుప్రధానంగా కనిపించినట్టు సాహ్ని భావిస్తున్నారు. టాల్‌స్టాయ్ రచనల్లో భారతీయులమైన మనకు మన హృదయస్పందనే వినిపిస్తుందని ప్రముఖ హిందీవచన రచయిత విష్ణు ప్రభాకర్ పేర్కొంటూ, కొన్ని సందర్భాల్లో ఆయన మన భారతీయ రచయితేననీ, ఆయన రచనలు భరతభూమిమీదే ఆవిర్భవించాయనీ అనిపిస్తుందన్నారు. టాల్‌స్టాయ్ కృషికి, జీవితం పట్ల ఆయన దృక్పథానికి విలక్షణమైన ఆత్మ పరిశోధన భారతీయులపై ఆయన నెరపిన శక్తి వంతమైన ప్రభావానికిగల ప్రధానమైన కారణాల్లో ఒకటని భారతీయ పండితుడైన ప్రభాకర్ మాచ్వే అభిప్రాయం, యీ లక్షణాలు మనుషులను సన్ని హితంచేస్తాయి; ప్రపంచవ్యాప్త సౌభ్రాతృత్వంపట్ల వారి హృదయంలో ఆకాంక్షను రేకెత్తించడానికి తోడ్పడతాయి..

స్లావ్‌లకూ, భారతీయులకూ మధ్యగల సాంస్కృతిక బాంధవ్య రహస్యాలను ఛేదించడాని కీ, భారతీయ, రష్యన్ సంస్కృతుల సారాన్ని గ్రహించడానికీ, తన కళద్వారా దాన్ని ప్రతి బింబించడానికీ ఏన్.కె.రోరిచ్ తన జీవితమంతా కృషిచేశారు. మానవజాతి మనుగడకు ఆధారంగా వున్న వున్నత నైతికసూత్రాలను వ్యక్తంచేస్తూ, ఐక్యత ద్వారా, మైత్రిద్వారా, నిజమైన విలువలను న్యాయంగా ధ్రువీకరించడంద్వారా మాత్రమే ప్రజలు ''బవిష్యత్తుకు మార్గాన్ని'' నిర్మించగలరని ఆయన విశ్వసించారు.

సోవియట్ యూనియన్, భారతదేశాలమధ్య సాంస్కృతిక ఆదానప్రదానాలు యిదివరకెన్నడూ లేనంతగా పెరిగాయి; దీని మూలంగా సోవియట్ ప్రజల్లో మిత్రభారతీయుల ప్రాచీన, మౌలిక సంస్కృతిపట్ల సరికొత్త, మరింత ప్రగాఢమైన ఆసక్తి యేర్పడుతోంది. భారతీయ సంస్కృతికి సోవియట్ యూనియన్‌లో ప్రాచుర్యంకల్పించే కృషికి యిటీవలికాలంలో ప్రత్యేకించి ప్రోత్సాహం

## సౌందర్యమూ విజ్ఞతల గురించిన నిజానిజాలు

లభిస్తోంది. భారతీయ కళాప్రదర్శనలను, సినిమా ప్రదర్శనలను, విడిగా కళాకారుల, సంగీత, నృత్య రూపకల్పనాబృందాల పర్యటనలను అనేకం యేర్పాటుచేయడంతోబాటు కాల్పనిక సాహిత్యాన్ని అనువదించి ప్రచురించడానికి విస్తృతమైన కార్యక్రమం నిర్వహిస్తున్నారు. సోవియట్‌యూనియన్‌లో భారతదేశ వుత్సవం, భారతదేశంలో సోవియట్ యూనియన్ వుత్సవం (1987—1988) యిందులో భాగమే. అదేసమయంలో భారతీయ అధ్యయనాలు మరింత విస్తృతస్థాయిలో జరుగు తున్నాయి. యీ అధ్యయనాలకు ఆద్యులైన ఎఫ్.ఐ.షెర్‌బాత్‌స్కీ, ఎస్.ఎఫ్.ఓల్డెన్‌బూర్గ్‌ల కృతులు ప్రాచీన భారతీయ సంస్కృతికి సంబంధించిన వివిధ అంశాలపై దృష్టికేంద్రీక రించాయి; యీ కృతులు ప్రపంచంలోనే గుర్తింపు పొందాయి. అనేకమంది సోవియట్ పండితులు యీనాడు యీదిశలో విజయవంతంగా కృషి జరుపు తున్నారు. అనేకమంది సోవియట్ పండితుల మౌలికరచనలను యిటీవలికాలంలో ప్రచురించారు.

ఈలోగా, భారతీయ మత, తాత్వికబోధలను, ప్రత్యేకించి యోగాసనాల, వేదాంతాల సారాన్ని అతిగా సరళంచేస్తూనో, వక్రీకరిస్తూనో వ్యాఖ్యానించ డానికి కొంతమంది అసమర్థులు పూనుకున్నారు. కొన్నిసార్లు, సోవియట్ పత్రికల్లోకూడా భారతీయ ఆత్మిక సంస్కృతిలోని విడివిడి ఘటనలను గురించి యేకపక్షమైన, విమర్శనాత్మక దృష్టిలేని అంచనాలు ప్రచురితమౌతున్నాయి. ఆ మహత్తర ప్రజల మేధస్సు సృష్టించిన నిజమైన ఆత్మిక విలువలను, అర్థంచేసుకోలేకపోవడం విచారకరం. అందువల్ల వాటి గురించిన సరైన, శాస్త్రీయమైన అవగాహన వున్నత పాండిత్యస్థాయిని మాత్రమే గాక సామాజిక, రాజకీయ ప్రాముఖ్యాన్నికూడా సంతరించుకుంటోంది.

# పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్

# పెరిస్త్రోయికాలో ఇమిడివున్న రాజకీయ విషయాలు

సమాజంలోని రాజకీయసంస్థల నిర్మాణ స్వరూపం ఏమిటి? అవి ఎలా పనిచేస్తున్నాయి? రాజకీయ వ్యవహారాల్లో ప్రజలు ఎలా పాల్గొంటున్నారు? వారి ఆదర్శాలు, విలువలు ఏమిటి? వారు ముందుగా ఏర్పరచుకున్న భావాలు, భ్రమలు ఏమిటి? వాస్తవ రూపం ధరించే సుస్థిర, దీర్ఘకాలిక రాజకీయ సంప్రదాయాలను గురించి చర్చించడం ఈ వ్యాస లక్ష్యం.



రచయితను గురించి:

డా॥పి.పొపొవ్ సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ తాలూకు అమెరికన్, కెనడా విషయాధ్యయన సంస్థలో రిసెర్చిఫెలోగా పనిచేస్తున్నారు. సామాజిక, రాజకీయ, మేనేజిమెంటు వ్యవహారాల్లో, ప్రత్యేక కృషిచేస్తున్నారు.

ఏసమాజ చరిత్రలోనైనారాజకీయాధికారమే కీలకసమస్య. అధికారం ఎవరిచేతిలో ఉంది? పెట్టుబడిదారీ దేశాలలో అధికారం బూర్జువా వర్గం చేతిలో ఉంది; సోవియట్‌యూనియన్‌లో అధికారం ప్రజలచేతిలో ఉంది. ఇదీ సాంప్రదాయక పాఠ్య పుస్తకాల సూత్రీకరణ. ఇది; పైప్రశ్నకు సమాధానం చెబుతుందని అనేకులు భావిస్తున్నారు.

అయితే, ఉదాహరణకు, బూర్జువాగ్రీసు, బూర్జువా ఛిలీ ఒకేవిధంగాలేవు. ఇతర పాశ్చాత్య దేశాలు కూడ ఈవిషయంలో ఒకదానికొకటి భిన్నమైనవి. సామాజిక పొరలమధ్య పలుకుబడి వేర్వేరు విధాలుగా పంపిణీకావడం, ఆయాదేశాల్లో ప్రజా ఉద్యమాలు, ప్రజల రాజకీయ కార్యకలాపాల స్థాయీ భేదం, ప్రజల రాజకీయ కార్యకలాపాలు —వీటినిబట్టి పాశ్చాత్యదేశాల్లో ఈతేడాలు వస్తున్నాయి. అధికార వ్యవస్థ స్వరూపాల సమస్య సోషలిస్టు దేశాల్లోకూడా తక్కువ ప్రధానమైనదేమీ కాదు. యిది సమాజంలోని యావత్తు జీవనరీతినీ నిర్ణయిస్తోంది. సోవియట్‌యూనియన్‌లోని రాజ్యాధికార వ్యవస్థయెలా రూపుకొంది?

## పెరిస్త్రోయికా కాలంలో ఇనుమడిస్తున్న రాజకీయ సంస్కరణలు

అధికారకేంద్రీకరణవైపు అప్రతిహతమైన మొగ్గుదల మన రాజకీయ చిరకాల సంప్రదాయాల్లో ఒకటి అయినందువల్ల పైప్రశ్నకు సమాధానం చెప్పాల్సిన అవసరం ఉంది. రాజరిక పాలనలోనే కాక, సోవియట్ హయాంలోకూడా యీ ధోరణి మనదేశచరిత్రలో పెద్ద పాత్ర నిర్వహించింది. విప్లవాన్ని తీసుకరావడంలో, అంతర్యుద్ధంలో, రెండవ ప్రపంచయుద్ధంలో మనం విజయం సాధించడానికి యిది తోడ్పడిన మాట నిజమే. అయితే, అసలు బూర్జువా వర్గ ప్రతిఘటనను బద్ధలు చేయడంకోసం నెలకొల్పిన శ్రామిక వర్గ నియంతృత్వం ఆతర్వాత శాంతికాలంలో అధికార వ్యవస్థ పైస్థాయి బృందాల నియంతృత్వంగా యెప్పుడు తయారైంది?

అధికారాన్ని పరిమితుల్లో ఉంచే సాధనాలు కూడా మనకు చాలా కాలంగా తెలిసినవే: అవి అధికారం న్యాయసమ్మతంగా సంక్రమించినదై ఉండటం, శాసన, కార్యనిర్వాహక, న్యాయపరిపాలనల కింద అధికారం విభజితం కావడం.

### లెనిన్ దృక్పథం

పారిస్‌కమ్యూన్ చరిత్రను, 1905 విప్లవంలో స్థాపితమైన సోవియట్ల చరిత్రను విశ్లేషించిన తర్వాత లెనిన్, సోవియట్లు కొత్త తరహా ప్రజాస్వామ్యానికి హామీ అనే నిర్ధారణకు వచ్చారు. సోవియట్ల పనిలోకి, రాజ్య వ్యవహారాల నిర్వహణలోకి శ్రామిక ప్రజానీకాన్ని ఆకర్షించవలసిన అవశ్యకతను ఆయన పదేపదే నొక్కి చెప్పారు.

సోవియట్లు నిజంగా ప్రజాస్వామిక మైనవిగా రూపొందాలంటే వాటికి ఎన్నికలు, ఎలాంటి ఆంక్షలూ లేనంత స్వేచ్ఛగా జరగాలి. "ప్రజలే ఎన్నికలను జరిపే పద్ధతినీ, ఎన్నికల తేదీనీ నిర్ణయించాలి. తామెన్నుకున్న వారిలో యెవరినైనా సరే వెనక్కి పిలిపించే హక్కు వారికి ఉండాలి." అని లెనిన్ రాశారు.

మితవాద సోషలిస్టు రివొల్యూషనరీల ప్రాబల్యంలో ఉండిన కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ రద్దయిన తర్వాత సోవియట్ల మహాసభ జాతీయస్థాయిలో అత్యున్నత రాజ్యాధికారసంస్థ అయింది. రెండు మహాసభల మధ్యకాలంలో అత్యున్నత రాజ్యాధికార సంస్థగా అఖిల రష్యన్ కేంద్రకార్య నిర్వాహకకమిటీ ఉండేది ఈ కమిటిని ఆమహాసభ ఎన్నుకొనేది. మహాసభ, లేక కేంద్ర కార్యనిర్వాహక కమిటీ, ప్రభుత్వాన్ని అంటే ప్రజాకమిస్సార్ల సమితిని ఎన్నుకునేది.

మొదట్లో వాటి విధుల్లో లెజిస్లేటివ్ విధులు, కార్యనిర్వాహక విధులు అన్న స్పష్టమైన విభజన ఉండేది కాదు. ఎన్నికైన ప్రతినిధులు శక్తివంతంగా పనిచేయడానికీ, ప్రజలకు వారు జవాబు దారీగా ఉండేందుకూ హామీ కల్పించడం అటువంటి విభజన ఉద్దేశం.

"సోవియట్ పార్లమెంటుకు" శాసనాలు చేసే అధికారం పేరుకు యిచ్చినా, ఆచరణలో చాలా వరకూ శాసనాలను కేంద్రకార్య నిర్వాహక కమిటీ కన్నా ప్రజాకమిస్సార్ల సమితే చేసింది.

లెనిన్ దేశానికి నాయకత్వం వహించిన ఆ ఐదేళ్ళ స్వల్పకాలంలోనే మన అనేక రాజకీయ ప్రమాణాలు, సాంప్రదాయాలు రూపుగొన్నాయి. అంతర్యుద్ధ పరిస్థితులవల్లకూడా, మన రిపబ్లిక్కును రక్షించుకునేందుకు తాత్కాలిక అసాధారణ చర్యలు అవసరమయ్యాయి. లెనిన్ అధికారం నిర్వివాదమైంది. ప్రకటిత సూత్రాలనుండీ, రాజ్యాంగ సంప్రదాయాలనుండీ తాత్కాలికంగా వైదొలగడాన్ని "జరుగుతున్నదేమిటో లెనిన్‌కు తెలుసు," "పరిస్థితి లెనిన్ అదుపులో వుంది" వంటి ప్రకటనలతో సమర్థించడం జరిగేది. రాజ్యాంగాన్ని ఉల్లంఘించి, ప్రజాకమిస్సార్ల సమితి అనేక శాసనాలను చేసేది. కానీ, ఈసమితికి అధ్యక్షుడుగా ఉండింది లెనిన్. కాబట్టి రాజ్యాంగ ఉల్లంఘనల వల్ల నష్టం కలగలేదు. లెనిన్ విజ్ఞత, ఆయన సైద్ధాంతిక మేధాశక్తి రాజకీయవేత్తగా, పార్టీ ఆర్గనైజర్‌గా ఆయన అపూర్వ ప్రతిభ ఉన్నతాధికార బృందాలచే అధికార దుర్వినియోగం కాకుండా హామీయిచ్చాయి. దీనికి తోడు, అత్యవసర చర్యల స్థానే శాసనాలతో ప్రభుత్వ వ్యవస్థను పునర్నిర్మించే పథకాలుకూడా ఉండినాయి.

## పెరిస్త్రోయికాలో ఇమిడివున్న రాజకీయ విషయాలు

ఆకాలంలో అనేక అత్యవసర చర్యలు తీసుకోవడం జరిగింది. న్యాయస్థానాలకు స్వాతంత్ర్యాన్ని "తాత్కాలికంగా" లేకుండా చేశారు. అయితే, ఈచర్యను ఎన్నడూ రాజ్యాంగబద్ధమొనరించడం జరగలేదు. "న్యాయం అన్న దానికి గల విప్ల వాత్మకమైన అర్థమే" కోర్టుల స్వాతంత్యంకన్నా ముఖ్యమని భావించారు. న్యాయవ్యవస్థపైతొలి డిక్రీ, కోర్టులకు గల ప్రాక్యురేటర్‌షిప్‌నూ, చట్టాల పాటింపును అజమాయిషీ చేసే అధికారాన్నీ రద్దు చేసింది. యిది బూర్జువా వర్గ, విదేశీ జోక్యం దారుల భీషణ ప్రతిఘటనా కాలంలో అనివార్య మయింది. లెనిన్ అనంతరం కొద్దికాలానికి, అదుపు చేయడానికి అవశ్యకమైన ఆయంత్రాంగాన్ని పార్టీ సభ్యులను చిత్రహింసలు పెట్టడానికీ; దేశంలోని ఏభిన్నాభిప్రాయాన్నైనా సరే అణచివేయ డానికీ ఉపయోగించసాగారు.

దేశపాలనలో పార్టీ పాత్రను క్రమబద్ధంచేసే యెలాంటి నిబంధనలూ లేకపోవడం ఆనాటి ప్రత్యేకతల్లో ఒకటి. "రాజ్యమూ — విప్లవం" (1917 ) అన్న తన రచనలో లెనిన్ రాసింది యిది:"కార్మికుల పార్టీని ప్రబుద్ధం చేయడం ద్వారా, మార్క్సిజం శ్రామిక వర్గ అగ్రదళాన్ని ప్రబుద్ధం చేస్తుంది. అటువంటి అగ్రదళం అధి కారాన్ని చేపట్టి, సోషలిజానికి యావత్తు ప్రజానీ కాన్ని నడిపించగలదు; నూతన వ్యవస్థకు మార్గ దర్శకత్వం వహించి, దాన్ని నిర్మించగలదు; శ్రమి స్తున్న దోపిడీకి గురవుతున్న సమస్త ప్రజానీకానికీ ఉపాధ్యాయుడుగా, మార్గదర్శక శక్తిగా, నాయక శక్తిగా ఉండగలదు".

పార్టీ "ఉపాధ్యాయుడుగా, "నాయకశక్తి"గా యెలా పనిచేయాలి? సమస్త ప్రభుత్వ సంస్థలకూ కమ్యూనిస్టులే ఆధిపతులుగా ఉండాలని దీనర్థమా? మొదట్లో అలాగే ఉండేది. కానీ, తగినంత మంది విశ్వాసపాత్రులైన పార్టీ సభ్యులు లేరనీ, అనేక మందికి పరిపాలనా సామర్థ్యం లోపించిందనీ పార్టీ త్వరలోనే గ్రహించింది. అందువల్ల పార్టీ సభ్యుల, కమిస్సార్ల పర్యవేక్షణలో పనిచేసే పార్టీ సభ్యేతర ప్రవీణులను నియమించాలని నిశ్చయించారు. ఎన్ని సంస్కరణలు జరిగినప్పటికీ, యీతరహా ద్వంద్వ నాయకత్వం చాలాకాలంపాటు రాజకీయ వ్యవస్థలో భాగంగా ఉండింద.

అడ్డూ అదుపూ లేని పార్టీ, ప్రభుత్వసంస్థల పాలనవల్ల కలిగే ప్రమాదాన్ని గురించి లెనిన్ తన జీవితచరమ కాలంలో అంతకంతకూ ఎక్కువ తరచుగారాయడం యాదృచ్ఛికమేమీ కాదు. కార్మికుల, ప్రజల అజమాయిషీ సమస్యను ఆయన నిరంతరం లేవనెత్తారు: "భాధ్యతాయుతులైన నాయకులను తామే ఎంచుకునే హక్కు సామాన్య ప్రజలకు ఉండాలి; సామాన్య ప్రజలకు తన నాయకులను తొలగించే హక్కు, నాయకుల కార్యకలాపాల్లో, అతిచిన్న చర్యతో సహా ప్రతివిషయం తెలుసుకునే, ప్రతిచర్యనూ తనిఖీచేసే హక్కు ఉండాలి" అన్నా రాయన.

ఆనాడు లెనిన్ చెందిన ఆందోళనను మనం నేడు బాగా అర్థం చేసుకోగలుగుతున్నాం. లెనిన్ పాలనా కాలంలో ప్రభుత్వ వ్యవస్థలోని లోటుపాట్లను లెనిన్ దూరదృష్టి, సర్దుకుపోయే తీరూ ఉప శమింపజేశాయి. కానీ, ఆయన తర్వాత వచ్చిన వారి పాలనలో ఈలోపాలవల్ల ఎనలేని నష్టాలు కలిగాయి.

### స్టాలిన్ దృక్పథం

లెనిన్ "పార్టీ మహాసభకు లేఖ"లో ఈఅదుపు లేని అధికార కేంద్రకరణ ప్రమాదాలను గురించి తన ఆఖరి హెచ్చరికను చేశారు. పార్టీ ప్రధాన కార్యదర్శికి అడ్డూ, అదుపూలేని అధికారం సంచి తమైందని ఆయన అందులో రాశారు. కేంద్రకమి టీ కార్యదర్శుల విధులను క్రమబద్ధం చేసే నిబంధనలేవీ నాడులేవు. కాబట్టి స్టాలిన్ పార్టీపై తన పట్టును పెంచుకోగలిగారు. లెనిన్ కాలంలో స్థాపితమైన కేంద్రీకృతాధికార వ్యవస్థ ఆయనతో ఏవిషయంలోనూ సాటిరాని నాయకులకు సంక్ర మించింది. ప్రజాస్వామ్యాన్ని గురించి "తన సొంత భావన" కల స్టాలిన్ లెనిన్ స్థానంలోకి వచ్చారు. నాడు పార్టీ, ప్రభుత్వ నాయకత్వంలో ఐక్యతలేదు. తరచు రాజకీయ, వ్యక్తిగత ఘర్షణలు ఉంటూ వచ్చాయి. స్టాలిన్ నైతిక సూత్రాలు లేని వ్యక్తి. రాజకీయ కుట్రలలో సిద్ధహస్తుడు. ఈఘర్షణలను నేర్పుతో వినియోగించుకున్నారు. ఒక ముఠాను నాశనం చేయడంకోసం మరొక ముఠాతో చేతులు గలిపారు. కామెనెవ్, జినోవ్యెవ్‌ల సహాయంతో మహాసభకు లెనిన్ రాసిన లేఖను తొక్కిపెట్టి,

## పెరిస్త్రోయికాలో ఇముడుతున్న రాజకీయ విషయాలు

పార్టీనేతగా తనస్థానాన్ని నిలబెట్టుకొన్నారు. తర్వాత బుఖారిన్, రైకోవ్, తోన్స్కిల సహాయంతో ట్రాట్స్కీ, కామెనెవ్, జినోవ్యేవ్‌లను రాజకీయరంగంనుండీ తొలగించారు.

స్టాలిన్ వర్ధమాన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో వ్యక్తిగత నియంతృత్వ రాజకీయ వ్యవస్థను స్థాపించారు. సోషలిజానికి అంకితులైన లక్షోపలక్షల ప్రతిభావంతులను స్టాలిన్ తుడిచి పెట్టారు. సంపూర్ణమైన నియంతృత్వ రాజ్యవ్యవస్థను నిర్మించి దానిలో తన వ్యక్తిగత అధికారాన్ని అర్థీకరంగం మొదలుకొని, శాస్త్ర, కళారంగాల వరకూగల అన్నింటిపైనా విస్తరింపజేశారు.

అర్థఫ్యూడల్ సమాజంలో ప్రజాతంత్ర సంప్రదాయాలు, ప్రమాణాలు పాదుకొనడానికి లెనిన్ హయాంలో శాంతియుత అభివృద్ధి సాగిన కాలం చాలిందికాదు. స్టాలిన్ దేశంపై రుద్దిన పరిపాలనా వ్యవస్థ రాచరిక సంప్రదాయాలను అంటే ఏ అధికార పీఠాన్నైనా భక్తితో ఆరాధించడం, పై అధికారులకు కిందివారు దాసోహం అనడం, పౌర హక్కుల్నూ, స్వేచ్ఛలను తృణీకరించడం మొదలైన వాటిని పునరుద్ధరించింది.

స్టాలిన్ పద్ధతులు సమాజంలో పైనుంచీ కింది దాకా, దేశవ్యాప్తంగా వ్యాపించాయి. పార్టీ, ప్రభుత్వ ఆర్థిక సంస్థలు వాటిని అనుకరించాయి. విమర్శ, నిర్ణయాలపై బాహాటమైన చర్చ, ప్రభుత్వ సంస్థలకు నిజమైన ఎన్నికల్నూ, మేనేజిమెంటులో ప్రజల భాగస్వామ్యంనాడు లేనేలేవు. నిర్ణయాలు. యేకగ్రీవంగా జరిగేవి. వ్యక్తి నియంతృత్వ వ్యవస్థ అయిన స్టాలినిజం నేడు అంతరించినప్పటికీ, ఆనాటి అనేక అప్రజాస్వామిక పద్ధతులు, ఆచారాలు ఇప్పటికీ ఉన్నాయి. నిరంకుశపాలనను, మన రాజకీయ వ్యవస్థలో పెత్తందారీ తనాన్ని తొలగించడానికి పాతపద్ధతులపై నమ్మకం ఉన్న నాయకులను తొలగించటమొక్కటే చాలదు. కరడుగట్టిన ఆవ్యవస్థనే బద్దలు చేయాలి.

### పెరిస్త్రోయికా దృష్ట్యా ఈసమస్య పరిశీలన

ప్రభుత్వ, పరిపాలనా సంస్థల విధులనూ, అధికారాలను క్రమబద్ధంచేసే సూత్రాలనూ, నిబంధనలను పునః పరిశీలించకపోతే, మనందరికీ ఆందోళన కలిగిస్తున్న అనేక సమస్యలు అలాగే ఉండిపోతాయి. పెరిస్త్రోయికా నేపథ్యంలో పార్టీపాత్రను నిర్వచించటంతో మనం ఈ పని ప్రారంభించాలి. ''సోవియట్ సమాజ నాయక, సారధ్యశక్తి'' కమ్యూనిస్టుపార్టీ అనీ, అది ''సోవియట్ ప్రజల మహత్తర నిర్మాణ కృషిని నడుపుతుంది'' అనీ రాజ్యాంగం చెబుతోంది. ఈపని అది యెలాచేస్తోంది? ఈ విషయంలో పార్టీకీ, యితర రాజ్యాధికార సంస్థలకూ భేదమేమిటి? ప్రజాప్రతినిధుల సోవియట్లపనిని ప్రాదేశిక పార్టీ సంస్థలు, ''ఆ సోవియట్లలో పనిచేస్తున్న కమ్యూనిస్టుల ద్వారా నడిపించాలని'' పార్టీ నిబంధనావళి చెబుతోంది. ''వాటిలో పనిచేస్తున్న కమ్యూనిస్టుల ద్వారా'' నాయకత్వం వహించే ఈ సూత్రాన్ని న్యాయస్థానాలకు, ప్రొక్యురేటర్ కార్యాలయాలకు వర్తింపజేశారు. అన్నిజిల్లా, మండల పరిపాలక సంస్థలను ఆయా జిల్లా, మండల కమ్యూనిస్టుపార్టీల కమిటీలు తమ పట్టులో ఉంచుకోవడానికి యిదిదారితీసింది

కాబట్టి రాజ్యాంగాన్ని మన నిజమైన మౌలిక శాసనంగా చేయడానికి అందులో మార్పులు చేయాలి. ఉత్తర్వులు అవసరంలేని చోటవాటిని జారీచేసే పాత అలవాటును నిర్మూలించేందుకు పాత నిబంధనలను మార్చివేయవలసి ఉంటుంది. '''నిషిద్ధంకాని ప్రతిదానికీ అనుమతి ఉంది'' అనే నిబంధన అమలు జరగాలి. ''అనుమతికోసం అధికారిని అభ్యర్థించే '' పాత అలవాటు పోవాలి. స్వయంపాలనకు యిది చాలా ముఖ్యం. నేడు అత్యధిక సమస్యలను తెచ్చిపెడుతున్నది రాజకీయ కార్యకలాపాలే. స్థానిక ప్రభుత్వ చర్యల పట్ల ఏమాత్రం నిరసన తెలిపినా దాన్ని వెంటనే అణచివేస్తున్నారు. బైకాల్ సరస్సుకు ప్రమాదకరమైన ఒక ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ప్రదర్శన జరిపిన వారిని ''ఉగ్రవాదులు'' ''విద్రోహులు'' అని స్థానిక అధికారులు ముద్రవేశారు.

ప్రజలు స్వతంత్రంగా వ్యవహరించడమంటే

అధికార్లకు భయం; ఇటువైపునుంచీ అధికారులు దేనికేమంటారో అని ప్రజలకూ భయం. యిది నేటి రాజకీయాల్లో

## పెరిస్త్రోయికాలో ఇనుమడిస్తున్న రాజకీయ సంస్కృతి

ఒక వాస్తవం. అదృష్టవశాత్తూ, ప్రజల్లో ఉన్న ఈ భయం నెమ్మదిగా క్రమక్రమంగా అదృశ్యమవుతోంది. ప్రజాస్వామ్యం ఎలా పనిచేస్తూ ఉందో, దానివల్ల పెత్తందారీ అధికార్లు ఎలా తగ్గవలసి వస్తోందో తెలుసుకొనేందుకు గ్లాస్నోస్త్ అవకాశ మిచ్చింది

పాలక యంత్రాంగ పునర్వ్యవస్థీకరణ నేటి కీలక సమస్యల్లో ఒకటి. పెరిస్త్రోయికా ప్రధానంగా రాజకీయాలకు సంబంధించిన విషయం. రాజకీయ వ్యవస్థను మార్చివేయడం, తాము సర్వాతీతులమని భావిస్తూ ఒక ప్రత్యేక సామాజిక పొరగా ఏర్పడిన వారిని రాజకీయాధికారం నుంచీ దించివేయడం దాని లక్ష్యం.

లెనిన్‌కాలంలో పరిపాలనా యంత్రాంగ పునర్నవీకరణ క్రమం తప్పకుండా జరిగేది. స్టాలిన్ కాలంలో కూడా "పునర్నవీకరణ" ఉండేది; యీ యంత్రాంగంలోని అత్యుత్తమ భాగాన్ని ధ్వంసం చేశారు. సిబ్బందిని మార్చడమనేది తన వ్యక్తిగత అధికారానికి హామీగా స్టాలిన్ భావించారు. 1960 లలోను, 1970 లలోను పరిపాలనా యంత్రాంగంలో కొత్తవారిని తీసుకోవడం దాదాపు పూర్తిగా నిలిపివేయడం జరిగింది. పదవులకోసం యెగబాకే పార్టీ యంత్రాంగంలోని వారిని ప్రమోట్ చేయడమో, కింది స్థానాలకు తగ్గించడమో మాత్రమే చేసేవారు. ఈ మార్పులు ఒక వలయంగా తయారయ్యాయి: వారిని పార్టీపని నుంచి, పరిపాలనా యంత్రాంగంలోకి, పరిపాలనా యంత్రాంగంనుంచీ పార్టీపనికీ మార్చేవారు. మంత్రిత్వశాఖ పనినుంచి తొలగించిన వ్యక్తి ఏదో ఒక ప్రభుత్వేతర సంస్థలో దాదాపు సమాన హెూదా గల పదవి పొందడం ఖాయం. కింది పదవికి మార్చిన వారిని ఈవలయం నుంచీ బయటికి నెట్టివేయకుండా, ఎప్పుడో ఒకప్పుడు ముఖ్యమైన పదవిలో నియమించే వారు. మనం యితర దేశాల విషయంలో పేర్కొనే పరిపాలక బృందం మనదేశంలో కూడా యిలా ఏర్పడింది.

లెనిన్ వ్యక్తం చేసిన భయాలు సహేతుకమైన వేనని మనం బహిరంగంగా ఒప్పుకోవాలి. ప్రత్యేక హక్కులు గలిగి, తొలగించ వీలుపడని నిరంకుశాధికార బృందాన్ని బ్యూరాక్రసీని - నిర్మించడం జరిగింది. ఈ బ్యూరాక్రసీకి, ఏదో కొంతమంది చిన్న అధికారులని అర్థంకాదు; పైశ్రేణి రాజకీయ బృందమని అర్థం. వీరుదేశాన్ని స్తబ్దతాస్థితికి తీసుకువెళ్ళారు. సంక్షోభం అంచుకు గొనిపోయారు. పార్టీలోని ఆరోగ్యకర విప్లవాత్మక శక్తులు ప్రారంభించిన పెరిస్త్రోయికా లక్ష్యం ఈ పరిపాలనా యంత్రాంగాన్ని బద్దలు కొట్టడం. పెరిస్త్రోయికా నిదానంగా సాగడానికి కారణం ఈ ఉన్నతాధికార బృంద ప్రతిఘటనే. బ్యూరాక్రసీ రాజకీయ అభివర్గం కాబట్టి దీనితో పోరాటంకూడా రాజకీయంగానే జరపాలి.

ఈ పోరాటంలో మనకున్న సాధనసంపత్తి ఏమిటి? అన్నిటికన్నా మొట్టమొదటిది, విప్లవం సృష్టించిన అధికార సాధనమైన సోవియట్లు; మన వ్యవస్థను బూర్జువా పార్లమెంటరీ రిపబ్లిక్కులనుండీ వేరు చేస్తున్నది ఈ సాధనమే. సోవియట్లకు ప్రారంభ కాలంనాడున్న సామాజిక అర్థాన్ని మనం పునరుద్ధరించాలి. ఇక ఎన్నికల విషయం. బహుళ అభ్యర్థి ఎన్నికల పద్ధతిని పునరుద్ధరించడం, ఎన్నికల ప్రచారాన్ని తిరిగి ప్రవేశ పెట్టడంతో మనమీ పనిని మొదలుపెట్టాలి. స్టాలిన్ కాలంలోనూ, ఆతరువాత సోవియట్లు, తదితర సంస్థల ఎన్నికల వ్యవస్థను పైవారు ఏఅభ్యర్థిని నిర్ణయిస్తే ఆ అభ్యర్థిని మాట్లాడకుండా ఆమోదించే తంతుగా దిగజార్చడం జరిగింది. తమకు నిజంగా ఎంచుకునే అవకాశం ఉందనీ, మార్పులు సాధ్యమేనని ప్రజలకు నమ్మకం గలిగే వాతావరణం సృష్టించడం ముఖ్యం. రాజకీయ వ్యవస్థ సమూలమార్పుకు యిది హామీ కల్పిస్తుంది.

మార్పులు మొదలయ్యాయి, ప్రజల్లో అనేక చొరవలు పుట్టుకు రావడం పెరిస్త్రోయికా ప్రధాన ఫలితాల్లో ఒకటి. గత కొన్నేళ్ళలో అనేక అనధికార సంఘాలూ, సంస్థలూ ఆవిర్భవించడం మనం చూచాం. ప్రజలు తమ మనస్సుల్లో ఉన్న విషయాలను బహిరంగంగా చెప్పడం మొదలు పెట్టారు. అయినప్పటికీ ఇది ఇంకా సంపూర్ణ ప్రజాస్వామ్యం కాదు. కానీ, ప్రజలు మారారు. వారిని తిరిగి నిద్రబుచ్చడం చాలాకష్టం.



# చైతన్యయుత

# జీవితం

చైతన్యయుతంగా జీవించాలంటే యేంచేయాలి? మొదటివిషయం. మనిషికి సరైన నైతిక ప్రవర్తన, సాంస్కృతిక లక్ష్యం వుండాలి. అంటే, నైతికప్రమాణాలను తెలుసుకోవాలి. దీన్నిగురించి చెప్పడం అవసరమని నేను భావించాను. యెందుకంటే, అనేక సందర్భాల్లో నైతికభావనలకు ప్రత్యామ్నాయాలను పెట్టడం, లేదా వాటిని క్షీణింపజేయడం జరిగింది. యిదంతా మనకాలంలో 1930 లలో గాక, చాలాపూర్వమే, బహుశా వందేళ్ళ క్రితమే ప్రారంభమైంది. ఒకవేళ పౌరనైతిక సూత్రాల్లో కొన్నిసార్లు మెరుగుదల కనిపించివుంటే అది యెంతోకాలం కొనసాగ లేకపోయింది.

గత రెండుమూడు దశాబ్దాల్లో నైతిక, ఆత్మిక విలువలు పునరుద్ధరణ పొందాయి. కానీ వాటిని కొత్తరూపంలో పునరుద్ధరించడం జరిగింది. వాస్తవానికి మనకు కనిపిస్తున్నదేమంటే - పదాల పునరుద్ధరణ. పదాలను నిర్లక్ష్యంగా వాడడంవల్ల అవి నిర్వీర్యమైపోతున్నాయి; పూర్తిగా పరస్పర విరుద్ధమైన విషయాలను తెలియజేయడానికి ఒకే పదాలను వాడడం జరుగుతోంది. యేది నీతో, యేది అవినీతో అర్థంచేసుకోవడం యీ రోజుల్లో కష్టమైపోతోంది. యీ యిబ్బంది 'అధికారవైఖరి' మూలంగా యేదో ఒక ఒత్తిడివల్ల తలెత్తింది కాదు. యెవరికివారు ఆ విలువలను గురించి తమసొంత, స్వతంత్రభావాలు వుంచుకోవడం యేవిధంగానైనా నిషేధంకాదు. అసలు విషయ



మేమంటే అనేకమంది తమను పెడదోవపట్టించే తప్పుడు ప్రమాణాల వ్యవస్థకు అవకాశమిస్తూ దారి తప్పిపోయారు; చివరకు వారు బయటపడ్డానికి వీల్లేని వూబిలో కూరుకపోయారు. అందులోంచీ బయటపడగలిగే అవకాశమున్న వాళ్ళకుకూడా యెలా బయటపడాలో తెలీలేదు. బూటకపు విలువలకు దూరంగా వుండాల్సిన అవసరాన్ని గుర్తించని వారుకూడా చాలామంది వున్నారు; అవేమేలు అని వాళ్ళనుకుంటున్నారు.

చైతన్యయుతంగా జీవించాలంటే, మనం విశ్వజనీన నైతికవ్యవస్థలో యెక్కడున్నామో రూఢిగా తెలుసుకోవాలి; సరైనమార్గం నుంచీ యేమేరకు వైదొలిగామో నిశ్చయించుకోవాలి. తర్వాత యీ యెరుకతో ముందుకు సాగిపోవాలి.

మనుమలకు రెండుచూపులున్నట్టే ద్వంద్వ చైతన్యంగల మనుమలు కూడా వున్నారు. యిది అవినీతి, యథాతథవాదం, చంచలప్రవృత్తినుంచీ ఆవిర్భవించినది. కానీ యెప్పుడూ రాజీకి సిద్ధపడని మరోరకమైన వ్యక్తులు కూడా వున్నారు. వాళ్ళు అబద్ధాలు చెప్పాల్సివస్తే యేమీ మాట్లాడరు, లేదా సత్యంచెప్పి, పర్యవసానాలను యెదుర్కొంటారు.

కపటాన్ని ఒకప్పుడు సహజమైన విషయంగా భావించేవారని గుర్తుచేసుకోవడం మంచిది. ఒకటి పౌరజీవితం కోసం, మరోటి సొంతవ్యవహారాల కోసం - యిలా సర్వసాధారణంగా రెండురకాల చైతన్యాలుండేవి. కానీ, అబద్ధాలలో చిక్కుకున్నది చైతన్యంకానేకాదు. అందువల్ల, అన్నీ నవ్యంగా వుంటాయని ఆశించడానికి ఒకవ్యక్తికి యిక మిగిలేదల్లా చిన్నమెత్తు అంతరాత్మ మాత్రమే. కానీ పనిపట్ల కపటస్వభావంగల మనిషి వ్యక్తిగత జీవితంలో కూడా అంతకన్నా భిన్నంగా వుండలేడు. కానీ మనం అంతరాత్మలో ఒకభాగాన్ని అవినీతికి గురిచేసి రెండోభాగాన్ని స్వచ్ఛంగా వుంచుకోలేము. ఆ అవినీతి వ్యాపించి తీరుతుంది. చిత్తశుద్ధిని కపటం తప్పనిసరిగా బయటికి నెట్టేస్తుంది. దాంతో మనిషి సందేహవాదిగా మారి పోతాడు లేదా అతనిది బూటకపుబ్రతుకు అవుతుంది.

నైతికవర్తనే సత్యం అని ప్రముఖసోవియట్ రచయిత, నటుడు వసీలి మక్షీన్ చెప్పారు. కానీ, సత్యం అనేది నైతికవర్తననుంచీ ఆవిర్భవించినప్పటికీ, దానికి ఆధారమైనప్పటికీ నైతికవర్తన సత్యానికి పరిమితమైవుండదు.

సత్యంచెప్పడం యిప్పుడు మునుపటికన్నా సులభం. కానీ మనం ఆ సత్యాన్ని భయంభయంగా చెప్తున్నాం. మన విమర్శలు కేవలం పరిమితకాలవ్యవధికే స్తబ్ధతాకాలానికే అంటిపెట్టుకుని వున్నాయి. కానీ కొన్ని విషయాలను చూసీచూనట్లు వ్యవహరించడంవల్లనే స్తబ్ధత యేర్పడ్డానికి అవకాశం కలిగింది. యిప్పుడుకూడా కొన్ని సమస్యలను అరమరికలు లేకుండా చర్చించలేకపోతున్నాం కాబట్టి మనం ఆందోళన చెందుతున్నాం. అంటే తిరోగమనం యిప్పటికీ సాధ్యమని దీని అర్థం. యీ మౌనం శరీరంలో వ్యాపించే వ్యాధిలాంటిది. యిది మనం పోరాడ్డానికి వీలుపడని అబద్ధాలను సృష్టించవచ్చు. యెందుకంటే, మనకు తగినంత నైతికస్వస్థతవుండదు. మంచికీ, చెడుకూ మధ్య స్పష్టమైన విభజనరేఖ గీయడంద్వారా, యీరెండు భావనలను సరిగా అంచనావేయడం ద్వారా మాత్రమే మనకు యెంతో అవసరమైన ప్రక్షాళన జరిగే అవకాశంవుంటుంది; అప్పుడు అన్నీ చక్కబడ్తాయి.

ఇది యీనాటి మనచర్యలకు పూర్తిగా వర్తిస్తుంది. గతంలో చేసిన తప్పులను గురించి మాట్లాడుతున్నప్పుడు, వాటిని నిందించాలని పట్టుపడ్తున్నప్పుడు అదేవిధంగా యీనాటి తప్పులను భవిష్యత్తు చేతుల్లో పెట్టకూడదు. అలాచేస్తే గతకాలపు సత్యాన్ని గురించి సంతృప్తిచెందినట్టు మాత్రమే అవుతుంది.

---

> "చైతన్యయుతంగా జీవించడమంటే నైతిక సత్ప్రవర్తన గల వ్యక్తిగా జీవించడమని అర్థం. అలాంటివ్యక్తి చేసేపనులు జీవితంలో మానవుని కర్తవ్యమనే శాశ్వత భావానికి, ఒకతరం నుంచీ మరోతరానికి వారసత్వంగా లభిస్తున్న యీ భావానికి అనుగుణంగా వుంటాయి:"
>
> **వలెంతీన్ రస్పూతిన్**

---

స్వస్థలంపట్ల, యీదేశపు గతంపట్ల వుదాసీనత, నైతిక విలువల పరిత్యాగం,వాటిని తప్పుదారి పట్టించడం, తక్కిన విషయాలతో బాటు

సంస్కృతిపై కూడా దుష్ప్రభావాన్ని నెరపింది. సంస్కృతి ప్రత్యేకప్రాముఖ్యాన్ని కోల్పోయింది; అత్యంత వైవిధ్యపూరితమైన, ఒక్కొక్కప్పుడు పరస్పర విరుద్ధమైన విలువలను అందించడం ప్రారంభించింది. మనం సూత్రాలకు బద్ధులం కాకుండా పోయివుండొచ్చుగాక; కానీ యిటీవలి దాకా యేదిమంచో, యేదిచెడో మనకు తెలుసు. యీనాడు యీరెండిటినీ స్పష్టంగా విడదీయలేక పోతున్నాం. యెందుకంటే మంచిదిగా నిన్న భావించినదాన్ని నేడు చెడ్డదంటున్నారు. వికారమైనదని నిన్న భావించినదాన్ని నేడు అందమైనదంటున్నారు. బూటకపువిలువలు అసలైనవిగా చలామణి అవుతున్నాయి. కాగా, మనిషికీ, దేశానికీ పవిత్రంగా వుంటూవచ్చిన విలువలను వెక్కిరిస్తూ చపకబారు వినోదంతో, పనికిమాలిన వేషధారణతో రుమ్మక్కవుతోంది కళ "మాతృభూమి", "దేశభక్తుడు", "సంస్మరణ", "చరిత్ర" అనే భావనలకు చాలా తరచుగా ఆగ్రహంతో జాత్యహంకార ఛాయను అంటగడుతున్నారు.

చౌకబారు సంస్కృతి, రాక్‌సంగీతం, "వినోదపరిశ్రమ"లను కేవలం అనుమతించడమేకాక, వాస్తవానికి వాటిని బోధిస్తున్నారు. సృజనాత్మక కృషిపట్ల, యువతకు వారి భవిష్యత్తులో వుపయోగపడగల ప్రయత్నాలపట్ల, మాటవరసకు దాతృత్వం, దయ, ఒక ఆశయానికి అంకితభావంపట్ల, నిస్వార్థంపట్ల యువజనపత్రికలు, టీ.వీ, రేడియో కార్యక్రమాలు దాదావు బొత్తిగా శ్రద్ధచూపడంలేదు.

చౌకబారు సంస్కృతిఅనేది వినిమయదారీ స్వభావంగల మానసికవ్యాధి. యిది శూన్యతకు, దౌర్భాగ్యానికి చిహ్నం. వ్యక్తిత్వంగల మనిషి యెవరైనా సరే యీ మానసికవ్యాధికి లొంగిపోడు. యితరులను అనుకరించాలనుకుంటూ గొర్రెదాటు తత్వానికి ముళ్ళేది బలహీనస్వభావం గలవాళ్ళే.

జాతీయ చరిత్రపట్ల, సంప్రదాయాలవట్ల ప్రపంచవ్యాప్తంగా అనేకదేశాల్లో ప్రజలశ్రద్ధాసక్తులు వెల్లువుకుతున్నాయి. గతస్మృతులగురించిన స్పృహ దాదాపు లేనిదేశం మనదే. మనంకూడా జాతీయ స్మృతిని పెంపొందించుకుంటున్నమాట నిజమే. జానపదగాథలను సేకరించి ప్రదర్శిస్తున్నాం; కొన్ని సంప్రదాయాలను అతికష్టంమీద గుర్తుకు తెచ్చుకుంటున్నాం; నలవ్యోవ్, కరమ్‌జీన్, క్ల్యూచెవ్‌స్కీల ప్రామాణిక చారిత్రక రచనలను ప్రచురిస్తున్నాం; కొన్ని చరిత్రాత్మక ఘటనల స్మారకోత్సవాలు మళ్ళీ ప్రారంభించాం.

మనం మనసంప్రదాయాలను అనుసరించడం చాలా ముఖ్యమైనవిషయం. తర్వాత యితర మార్పులు వస్తాయి. సాంప్రదాయిక రూపాలకు కట్టుబడివుండే ఒకేఒక సాంప్రదాయిక కళవుండాలని నా అభిప్రాయంకాదు. కానీ సంప్రదాయాలను గౌరవిస్తే, ఆధునిక కళ వాటిని గౌరవిస్తుంది; దౌర్జన్యాలకు, అబద్ధాలకు అవకాశమివ్వదు. సంప్రదాయాలను గౌరవించినట్లయితే కళే నిస్సారమైనది కాజాలదు. అది కుహనాకళగా క్షీణించిపోదుకూడా. దీనిమూలంగానే సంప్రదాయాలు యింత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటున్నాయి. శతాబ్దాలుగా రూపొంది, మెరుగులుదిద్దుకున్న యీ సంప్రదాయాలు సంస్కృతిపై ప్రయోజనకరమైన, బలోపేతమైన ప్రభావాన్ని నెరపుతాయి.

దైనందిన జీవితంలో ప్రజలు కనబరుస్తున్న హీనస్థాయి సంస్కృతి అనేది మరో ముఖ్యమైన సమస్య. యీసమాజానికి యిదివరకెన్నడూ యింతటి వుదాసీనత, వేదన, కపటాభినయం తెలియదు.

సమాజంమీద యెన్నో బాధ్యతలు మోపారు; ఫలితంగా మనిషికి మిగిలిన భాధ్యతలు చాలా తక్కువ. ప్రజలు దీనికి అలవాటు పడిపోయారు. యిప్పుడు వారు తమ తప్పులకు, ఆనందం కొరవడిన తమజీవితాలకు, తమ వుదాసీన వైఖరులకు, యింకా చెప్పాలంటే తమ పనికిమాలిన చేష్టలకు సమాజాన్ని నిందిస్తారు. వారు తమ విజయాలను తాముతప్ప మరొకరు సాధించలేదని ప్రకటించుకుంటారు. సమాజంలో మనం అంతర్భాగమనీ, మనలో ప్రతిఒక్కరూ కేవలం ఒక అణువు మాత్రమేకాదనీ, స్వేచ్ఛగల, క్రియాశీలమైన వ్యక్తులమనీ యిటీవలి కాలంలో మనకు పదేపదే చెప్పడం జరిగింది. మనదేశంలో యెలాంటి సమాజముంద నేది మనం యెలాంటి మనుషులమనే దానిపై ఆధారపడివుంది. కాగా, మనదేశంలోని జీవితంలో అంతకంతకూ గొప్పపాత్ర నిర్వహిస్తున్న ప్రజాభిప్రాయం మన సమిష్టి అభిప్రాయంతప్ప మరేమీకాదు. దీన్ని మనం క్రమక్రమంగా గుర్తిస్తున్నట్టు, దీనిపట్ల అభిరుచిని పెంపొందించుకుంటున్నట్టు కనిపిస్తోంది. కానీ, ప్రజలు తాము చెప్పదల్చుకున్నదేమైనా వున్నా లేకపోయినా అరిచిగీపెట్టడం ఆందోళన కలిగిస్తోంది. యీ "దుష్ప్రభావం" తొలగిపోతుందని ఆశిద్దాం!



మానవ విలువలు

# మన బాంధవ్య మూలాలు

(సోవియట్ యూనియన్‌లో జాతుల మధ్య సంబంధాలు)

లేవ్ గుమిల్యోవ్ ప్రముఖ రష్యన్ కవి నికలాయ్ గుమిల్యోవ్, కవయిత్రి అన్నా అఖ్మతో వాల కుమారుడు. ఆయన స్టాలినిస్టు దమన కాండ కాలంలో రెండు సార్లు జైల్లో ఉన్నారు.

పునరావాసం తర్వాత కొంతకాలానికే ఆయన 'తన పట్టుదల, సంకల్పబలంతో చరిత్రలో డాక్టరేట్ పొందారు. భూగోళశాస్త్రంలో ఉత్తమ గ్రంథాలు రచించారు. రష్యన్ స్టెప్పీలలోని సంచార జాతులపై గ్రంథాలు రచించారు. "రూస్ అండ్ ది గ్రేట్ స్టెప్పీ" ఆయన మౌలిక గ్రంథం.

ప్ర: జాతి భేద ప్రసక్తి లేకుండా పౌరులంతా సమానులేనని సోవియట్ రాజ్యం ఏర్పడిన వెనువెంటనే ప్రకటించింది. యిది మనం సరైనదిగా అంగీకరించే సుప్రసిద్ధ వాస్తవం అయితే, అల్పబుద్ధి మరీ అంత మొరటుగా కాకపోయినా అనాగరికంగా వ్యక్తం కావడం మనమెంత తరచుగా చూచామని.

జ: ఏదైనా ఒక జాతి తన భూభాగంలో చాలా కాలం పాటు ప్రశాంతంగా జీవిస్తే దాని ప్రతినిధులు తమ అభిరుచులు, నిబద్ధతలు, అంటే "ప్రవర్తనా మూసపోత పద్ధతులు" అని నేడు మనమంటున్న ప్రతిప మాత్రమే సాధ్యమైనదీ, సరియైనదీ అన్న అభిప్రాయానికి వస్తారు. వీటి నుండీ వైదొలగిన ఏ ప్రవర్తననైనా విద్యా విహీనతగా పరిగణిస్తున్నారు.

మనం యితర జాతులతో శాంతి యుతంగా జీవించాలంటే, ఏ చర్యకైనా వాటి ప్రతిస్పందనను ముందే వూహించి, నొప్పికలిగించే చర్యకు పాల్పడ కుండా ఉండాలి. కొన్ని జాతుల వారి విడ్డూరమైన మర్యాదలు పాటించలేక పోయినందువల్ల యెంతమంది ప్రయాణీకులు మరణించారో ఆలోచించండి! పరస్పర అపార్థం వల్లా, లేక సమస్త జనమూ ఒకలాగే, అచ్చు మనలాగే ఉంటారు కాబట్టి అర్థంచేసుకోవలసిన దేమీ లేదు అన్న తప్పుడు నమ్మకంవల్లా అనవసర ఘర్షణలు, యెన్ని చెలరేగాయని! జనమంతా ఒకలాగే ఉండరు. పొరపాట్లు జరగకుండా చూడాలంటే ప్రస్తుతమున్న తేడాలు మనం తెలుసుకుని ఉండాలి లేనిప

# మన బాంధవ్య మూలాలు

క్షంలో పరస్పర అవగాహన, సామరస్యం సాధ్యపడవు.

ప్ర: పరస్పర సంబంధాలు మరింత ముమ్మర మైనందువల్ల జాతీయ బృందాల మధ్య సంబంధాలకు నిబంధనలను రూపొందించడాని కిది తరుణంకాదా?

జ: అన్ని సందర్భాలకూ సరిపోయే నిబంధనలు, ఆదేశాలను రూపొందించడం సాధ్యమో కాదో నాకు తెలియదు. కాని, యెవరైనా విషయాలు తెలియ నందువల్ల అప్పుడప్పుడు ఇబ్బందికరమైన పరిస్థితిలో చిక్కుకోవచ్చు. ఉదాహరణకు అంత్యక్రియలలో రష్యన్లకు టోపీలు తీసివేయడం పరిపాటి. అదే, ముస్లిం ఆచారాలను పాటించే ప్రాచ్యజాతులవారు యిలాంటి సమయంలో టోపీలను విధిగా పెట్టు కుంటారు. ఈ విషయాలను విధిగా పరిగణనలోకి తీసుకోవాలి. జాతులు ఒకదానితో ఒకటి వ్యవహ రించవలసిన తీరును యువజనులకు మనం తగినంతగా బోధించడం లేదు. ఒకవేళ బోధించినా ఆపని చాలా నిర్లక్ష్యంగా చేస్తున్నాము. అందువల్ల దుష్ఫలితాలు వస్తున్నాయి. పాటించ వలసిన సూత్రం చాలా సరళమైనది: గౌరవభావం, సహనం, సానుభూతులతో వ్యవహరించు: యితరు లు నిన్నెలా చూడాలనుకుంటావో, యితరులను నువ్వలా చూడు.

ప్ర: ''కామ్రేడ్'' అన్న పదాన్ని మనదేశ ప్రజల్లో అత్యధిక మెజారిటీ ప్రజలు అన్నిటి కంటే ప్రియ మైనదిగా యెంచుతారు. అయినప్పటికీ, కొన్ని సమయాల్లో పాత అయిష్టతలు ప్రజ్వరిల్లి ఘర్షణలకు దారితీస్తాయి.

జ: ఒకరిపై ఒకరికి ద్వేషాన్ని పురికొల్పే పద్ధతి ఒకటే ఉంది. అది అన్ని దేశాల్లో అనేక శతాబ్దాల పాటు నెగ్గింది. జాతులమధ్య సహజంగా ఉన్న తేడాలను బట్టి "మనం" "వాళ్ళు" అనడం ఒక్కొక్కప్పుడు దుష్టార్థాన్ని సంతరించుకొంటుంది. దీన్ని "మనం మనుషులం," "వాళ్ళు మనుషులు కారు'' అనే విపరీత స్థాయికి తీసుకపోవడం కద్దు. అప్పుడు "వాళ్ళు" మనదృష్టిలో దగాకోర్లు, నిరంకుశులు, క్రూరులు వగైరా అయిపోతారు. ''శత్రువు'' గురించిన భావనలు సృష్టించకుండా శత్రుత్వ బీజాన్ని నాటడం అసాధ్యం.

ఏ జాతీయవాదమైనా గుడ్డిదని చెప్పడంతో సరిపోదు. దాని హానికర సారాంశాన్ని దాని విద్రోహ పూరిత మేధా ప్రక్షాళలనా పద్ధతులను కూడా బయట పెట్టాలి. నేటికీ కొంతమందికి జాతుల మధ్య ఘర్షణలను అలాగే ఉంచడంలో ఆసక్తి ఉంది; వారు తమ స్వార్థప్రయోజ నాలకు జాతుల మైత్రిని బలిపెట్టడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ వాస్తవాన్ని విస్మరించ జాలము. మార్పులు జరిగినప్పటికీ వీరు తమ సుఖమైన ఉద్యోగాలను అట్టిపెట్టుకో ప్రయత్నిస్తున్న స్వార్థపరులు; మానవుల మధ్య పురాతన సంబంధాలను కాపాడ గోరే పచ్చి యథాతథవాదులు. వాళ్ళు ప్రతిదాన్నీ ముఖ్యంగా గత చరిత్రను ఉపయోగించుకొంటారు.

ప్ర: కీలక చారిత్రక కాలాల్లో జరిగినట్టుగానే యిప్పుడు గతాన్ని గురించిన అధికతర ఆసక్తి వ్యక్తమవుతోంది. తమకన్యాయం జరిగిందనే శతాబ్దాలనాటి భావాలను నేటికి కూడా అట్టిపెట్టడానికి జరుగుతున్న ప్రయత్నాలను గురించి మీరే మనుకుంటున్నారు? కక్ష, అనుమానం శాశ్వతంగా ప్రజల హృదయాల్లో గూడు కట్టుకొని ఉంటాయా?

జ: చరిత్రను మేధస్సుతోనే గాక సహృద యంతో అంటే ముందే ఎలాంటి దురభిప్రాయాలూ ఏర్పరచుకోకుండా అధ్యయనం చేయాలి. అపోహలు లేని ఈ సహృదయతను మనిషి మనసులో చిన్న తనంలోనే పాదుకొల్పాలి.

మన మాతృభూమి చరిత్రలో మనం అర్థం చేసుకోవాల్సిందీ, తిరిగి పరిశీలించాల్సిందీ యెంతో ఉంది. మనది కేవలం ప్రాచ్య, పాశ్చాత్య ప్రపంచా లు సంగమించిన గడ్డ మాత్రమే కాదు; ప్రాచీన కాలం నుంచీ మానవాళికి మౌలిక ప్రాధాన్యంగల క్రమాలకు వేదికగాకూడా ఉంటోంది. సామాజికాభి వృద్ధిని దుష్టయుద్ధాల, దండయాత్రల, కుట్రల జాబితాగా కాక, ప్రజల కార్యకలాపాల ఫలితంగా మనం పరిగణిస్తే లోతుగా వేరూనిన మన బాంధ వ్య మూలాలను చూడగలుగుతాము. ఈ అభిప్రా యానికి యెవరూ సూత్రరీత్యా అభ్యంతరం తెలపరు. కాని, రష్యన్ రాకుమారుడు అలెగ్జాండ్ర్ నెవ్‌స్కీ, మంగోల్ ఖాన్ బాటూ దత్తపుత్రుడన్న వాస్తవాన్ని చాలామంది నిస్సంకోచంగా స్వీకరించగలరా?

ప్ర: ఈ వాస్తవాన్ని ఒక మినహాయింపుగా పరిగణించ వచ్చు. యిలాంటి ప్రాతిపదికపై ఏదైనా భావనను

# మన బాంధవ్య మూలాలు

రూపొందించడం మీరు సరైనదనుకుంటున్నారా? ఈ వైఖరితో మనం తప్పుదారి పడతామేమో?

జ: నేనిప్పుడు చెప్పిన వాస్తవం అకడమీ షియన్ వి. వెర్నాద్‌స్కీ పేర్కొన్న సార్వత్రిక నియమానికి అనుగుణంగా ఉంది. అదేమిటంటే: "తన చరిత్ర, జాతుల పొందిక, స్వభావం దృష్ట్యా రష్యా యూర పియన్ దేశమే గాక ఆసియా దేశం కూడా మనం ఒక విధంగా రెండు ఖండాల ప్రతినిధులం. మన దేశంలో క్రియాశీలమైన ఆత్మిక శక్తుల మూలాలు ఈ రెండు ఖండాల గత చరిత్రలో వేరూని ఉన్నాయి..." నా గురువైన ఈ మహా పండితుడు "రష్యాలో నివసిస్తున్న జాతులు పరస్పర పరిచయాన్ని ఏర్పరచుకోవాలన్న" కర్తవ్యాన్ని నిర్దేశించారు. అది ఇంకా మనముందుంది. ఓల్గా, కాకసస్, మధ్యాసియా సైబీరియా ప్రాంతాల్లో ఏ జాతుల పూర్వీకులు పరస్పరం ఘర్షణ పడ్డారో ఆ జాతులే నేడు ఒకే కప్పుకింద జీవిస్తున్నాయి. పూర్తిగా కొత్త సూత్రాలపై జీవితాన్ని కలిసి పున ర్నిర్మిస్తున్నాయి.

బెర్లిన్‌ను పట్టుకున్న తర్వాత 1945 లో నేనొక జర్మన్ పండితుణ్ణి కలుసుకున్నాను. స్లావ్‌లు ప్రాచీన జర్మన్ భూభాగాలను తమప్రాంతాల్లోకలిపే సుకున్నారని ఆయన అన్నారు. నేను అంగీకరించ లేదు. అవి ప్రాచీన స్లావ్‌ల భూభాగాలనీ చెప్పాను. చరిత్రలో ఏదో ఒక కాలంలో జాతులన్నీ ఒక చోటినుండి మరోచోటికి వెళ్ళినవే; కొన్ని జాతులు మరికొన్నిటిని ఓడించినవే. యిది అభావాన్ని అభావం చేయడమన్న గతితార్కిక నియమం అమలు జరగడం తప్ప మరొకటికాదు.

ప్ర: ప్రతి జాతికీ తన సొంత వీరులున్నారు. దానికి ప్రియమైన చారిత్రక దినాలు, స్మారక ప్రదేశాలు, పూర్వీకుల సమాధులూ ఉన్నాయి. "పితరుల సమాధుల"పై ప్రేమను గురించి పుష్కిన్ మాట్లాడారు. తమరక్త సంబంధీకులను గుర్తుంచుకోక పోవడం అంత కన్నా ఘోరమైంది కదా?

జ: చరిత్ర తెలిసి ఉండటం, దాన్ని ప్రేమించడం వేరు. యితర జాతులను తమ దురదృష్టాలకూ, ప్రమాదాలకూ మూలకారణంగా భావించడం వేరు. వివిధ జాతులు యెలా పరస్పరం ప్రతి స్పందించాయో, పరస్పరం ప్రభావం నెరపు కున్నాయో భాషలు, సాంప్రదాయాలు, సంస్కృతుల అధ్యయన వేత్తలకు బాగా తెలుసు. దీనికి చరిత్ర పత్రాల్లో చాలా దాఖలాలు ఉన్నాయి. ఉదాహరణకు, వెయ్యేళ్ళ క్రితం తూర్పు యూరప్ లోని రెండు పెద్ద రాజ్యాలు కీవ్ రూస్, ఓల్గా బల్గేరియాలు శాంతి సంధిని చేసుకుని ఆ సంధి అమల్లో ఉన్న 250 యేళ్ళూ దాని సత్ఫలితాలను అనుభవించాయి. మధ్యలో స్లావ్‌లు క్రైస్తవమతం అవలంభించినా, టర్కులు ఇస్లాం మతస్థులైనా ఈ సంధిభగ్నం కాలేదు. మధ్య ఓల్గా ప్రాంతంలోని జవాభాలో అత్యధిక సంఖ్యాకులు ఆ బల్గేరియన్ల సంతతివారే. విధివైపరీత్యమేమంటే వీరిని తార్తా రులని, వీరి బాష తార్తార్ బాష అని అంటున్నారు. ఇదొక ముసుగు తప్ప మరొకటి కాదు.

చరిత్రపై ఆసక్తి పెరుగుతూండటం సంతోషకరం. మనమహామేధావులైన కరమ్ జిన్, క్లుచేవ్‌స్కీ, తదితరుల గ్రంధాల పునర్ముద్రణ జరగడం మంచి విషయం. ఆధునిక సోవియట్ పరిశోధకుల తాజాగ్రంథాలు కూడా పాఠకునికి అందాలి. అదొక ముందంజ కాగలదు. యిది మనకెంతో అవసరం. ఎందుకంటే గ్రానోవ్‌స్కీ చెప్పినట్లు "నిజాన్ని గ్రహించడానికి ప్రపంచ చరిత్ర తోడ్పడినంత మరే శాస్త్రమూ తోడ్పడదు."

ప్ర: దేశభక్తి ఒక గొప్ప ఉదాత్త భావం అయితే, దీన్నర్థం చేసుకుని, వ్యాఖ్యానించాలంటే మనం ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలి: ఫలానా జాతికి చెందినవారంటే అర్థం ఏమిటి? "జాతీయ" అంటే అర్థం ఏమిటి?

జ: ప్రపంచంలో ఒక్కమనిషికూడా తన జాతికి వెలుపల ఉండజాలడని అర్థంచేసుకోవడం అవసరం. జాతీయత నిర్వివాద వాస్తవం. తన జాతినుండీ బయట పడటం అసాధ్యం. యిది మానవ స్వభావంలో సహజ సిద్ధంగా ఉంది కాబట్టి జాతీయ సమస్యలను తోసివేయరాదు. ఉన్న వైరు ధ్యాలను ఉపేక్షించి, జనాన్ని ఏకరాశిగా చిత్రించ ప్రయత్నించరాదు.

ఏ జాతిపైననైనా తన మూసపోత ప్రవర్తనా రూపాలకు కారణమైన పరిసరాలు, చారిత్రక నేపథ్యాల ముద్రఉంటుందనే విషయం మనసులో పెట్టుకోవాలి.

# మన బాంధవ్య మూలాలు

వైవిధ్యం మనసమాజానికీ మొత్తంగా మానవాళికీ సహజమైనదే. అది మానవాళికి తమపరిసరాలతో గల ప్రగాఢ సంబంధాన్ని ప్రతిబింబిస్తోంది. ఈ పరిసరాలు మానవాళి నివాసస్థలం. అవి దానికి ఆహారాన్ని అందిస్తున్నాయి. దాని కళా విలువలను రూపొందిస్తున్నాయి. నాగరికత అతి సూక్ష్మమైన వివేచనా రంగంలో ప్రవేశించడానికి కూడా జాతీయాంశం తోడ్పడుతుంది.

ప్ర: ''పరిణామ వసంతం'' తన పొంగుతో అన్ని జీవ వ్యవస్థలను ప్రేరేపిస్తున్న జీవ రసాయనిక శక్తి అని వెర్నాద్ స్కీ చెప్పారు. కాబట్టి, మనుషులు కూడా దీని ప్రభావానికి గురవుతారు. ఈ భావాలకూ, జాతుల స్వయం పరిణామానికీ ఏదైనా సంబంధం ఉందా?

జ: అత్యంత ప్రత్యక్ష సంబంధం ఉంది. వేలాది సంవత్సరాల శంఖా వర్త పరిణామక్రమాల్లో జాతులు నిరంతరం కలుస్తున్నాయి. కాబట్టి కేవలం జాతీయ స్వచ్ఛత, కలవకుండా ఉండటమన్న ప్రశ్నలేదు. కొత్త జాతులు యెప్పుడూ కనీసం రెండు పాతజాతుల విలీనంవల్ల ఏర్పడుతున్నాయి. దీనికి చరిత్రలో అనేక దృష్టాంతాలున్నాయి.

ప్ర: మన ఆంతరంగిక జాతీయ వ్యవహారాలను బయలు పెట్టడం తప్పని చాలా కాలం పాటు అనుకున్నాము. అయినప్పటికీ, ఈ వ్యవహారాలు సరళంగా, సజావుగా లేవు. అవి కొన్నిసార్లు పౌర జీవితంలోని అనేక వైరుధ్యాలను ప్రతిబింబిస్తున్నాయి. ప్రాణాంతక ఘర్షణలు కూడా జరిగాయి. యివి జరిగిన తర్వాత గోరంతలు కొండంతలు చేసే అన్ని రకాల వదంతులూ వ్యాపించాయి. మనం వీటిని నమ్మితే, పెరిస్త్రోయికాను, ప్రజాస్వామ్యీకరణను నిందించాల్సి వస్తుంది. అవునా?

జ: కాలం చెల్లిన ఈ భావాలు కొందరు సంకుచిత మనస్కులను పట్టుకుని వదలడం లేదు. వీటిని, అన్ని రకాల సంకుచిత జాతీయతను స్వప్రయోజనాలకు వినియోగించుకునే నానా ప్రయత్నాలను శాస్త్రీయ విజ్ఞాన బలంతో వ్యతిరేకించాలి.

ప్రజాస్వామ్యీ కరణ తప్ప మరేదీ జాతీయ సమస్యలను పరిష్కరించ జాలదు. జాతీయాంశం ప్రజాస్వామ్యీకరణకు ప్రోద్బలమివ్వాలి. జాతులు ఒకదాని నొకటి గౌరవిస్తూ వాటి సంస్కృతిని, భాషను, చరిత్రను గౌరవంతో చూస్తూ పరస్పరం సహకరించు కున్నప్పుడు వాటి మధ్య నిజమైన స్నేహం నెలకొన గలదు. అందువల్ల వివిధ జాతుల సంస్కృతుల మధ్య సంబంధాలను ఏర్పరచడానికి మనం పాటుపడాలి.

జాతీయ ప్రత్యే కతలను గోరంతలు కొండంతలు చేయరాదుకాని వాటి పట్ల అత్యంత జాగ్రత్తగా వ్యవహరించాలి. జాతుల మధ్య సామ రస్యాన్ని, ఏకీకరణను బలవంతంగా నెలకొల్పడానికి ప్రయత్నాలు సదుద్దేశంతో జరిగినా సమర్థనీయం కాదు. అది సుదీర్ఘమైన క్రమం. అబ్ఖజియన్, నివిఖ్, లిథూనియన్ లేదా, మాల్దేవియన్ నడవడిని ఒకే మూసలో ఇమిడి ఉండేలా ఎందుకు మలచాలి?

మార్క్స్ దూరదృష్టితో చెప్పినది వాస్తవమయ్యే రోజు వచ్చింది. మానవ శాస్త్రంలో ప్రకృతిశాస్త్రం అంతర్భాగమైనట్లే ముమ్ముందు ప్రకృతి శాస్త్రంలో మానవ శాస్త్రం చేరిపోతుందని ఆయన అన్నారు. మానవుడే పరమ లక్ష్యంగా కల పెరిస్త్రోయికా ఆశయాలకు ఇది అనుగుణంగా ఉంది. నేటి ప్రజలు తమ ఆర్థిక ప్రపంచాన్ని తమ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని తెలుసుకుంటున్నారు. ఈ ప్రపంచంలో వివిధ జాతుల మధ్యసంబంధాలు శాస్త్రీయ ఆదాన ప్రదానాలు పెంపొందు తున్నాయి. ఒకదానితో ఒకటి తల పడటంతో పాటుగా ఒకదాని వల్ల మరొకటి పరిపుష్టం కావడమూ జరుగుతోంది. మనదేశ చరిత్ర, ఈ దేశంలో నివసిస్తున్న100 కు పైగా జాతుల, ఉపజాతుల చరిత్ర భవిష్యత్తును గురించి మరింత బాగా అవగాహన చేసు కొనేందుకు తోడ్పడుతుంది. ఈ సందర్భంలో వెర్నాద్‌స్కీ చెప్పినదిది: ''ఈ విశాల రాజ్యంలో నివసిస్తున్న ప్రజలకు అది చేకూర్చు తున్న సమస్త నూతనాంశాలూ, మనమంతా పాటుపడి సాధించపూను కున్న భవిష్యత్తుకు—జాతులు సహజీవనం చేసే శాంతియుత ప్రపంచానికి — అనువుగా రూపుదిద్దుకుంటున్నాయి. రక్త సిక్తమూ, బాధామయము ఐన మన చరిత్ర ద్వారా సంపాదించిన ఈ సువిశాల దేశాన్ని విశ్వమానవ విజయంగా మనం కాపాడుకోవాలి. ఇది మానవాళి ఏకైక ప్రపంచసంస్థ ఆవిర్భావాన్ని మరింత చేరువకు తెస్తుంది. మరింత సుసాధ్యం చేస్తోంది.''

(ఇజ్వెస్తియా, సంక్షిప్తం)

# సోవియట్ యూనియన్‌లో సంస్కరణల తక్షణావశ్యకత



**అకడమీషియన్ ఎల్.అబాల్కిన్**

**సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ తాలూకు అర్థ శాస్త్ర ఇనిస్టిట్యూట్ డైరెక్టర్**

చైనా మొదట వ్యవసాయాన్ని, సేవా పరిశ్రమను, వ్యాపారాన్ని పునర్ వ్యవస్థీకరించి, వనరులను పోగుచేసుకొని ఆ తర్వాతనే 5-8 యేండ్లకాలంలో పరిశ్రమల్లో సంస్కరణను చేపట్టింది. కాని మీరు అలా కాకుండా సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థను మొత్తంగా ఒకేసారి పునర్ నిర్మించడానికి యెందుకు పూనుకున్నారని అమెరికన్ అర్థశాస్త్రవేత్తలు యిటీవల నన్ను అడిగారు.

చైనాకు బహుశ 5-8 యేండ్ల వ్యవధి వుండి వుండొచ్చు, కాని మాకు లేదని నేను సమాధాన మిచ్చాను. మాకు లభించిన సమయాన్ని మేము వృధా చేశాం, అందువల్ల పరిశ్రమల్లో సంస్కరణను వాయిదా వేయలేం. యిందుకు మరో ఎనిమిదేళ్ల కాలాన్ని మేము వృధా చేస్తే సాంకేతిక, పారిశ్రామిక అధునాతన శక్తిగా మేము వుండజాలము. అప్పటికి ఒకటి లేదా రెండు తరాల సాంకేతిక పరిజ్ఞానం, వుత్పత్తి పద్ధతులు మారిపోతాయి. వాటిని మేము ఏనాటికీ అందుకోలేము.

మేము త్వరపడాల్సి వచ్చింది. అందువల్లనే ధరల వ్యవస్థను సంస్కరించకుండానే పరిశ్రమాది సంస్థల్లో పూర్తి స్థాయి వుత్పత్తి ఖర్చుల మదింపు పద్ధతిని ప్రవేశపెట్టాం. దీనివల్ల బ్రహ్మాండమైన ఫలితాలు లభిస్తాయని భావించవద్దు. విజయాలు క్రమక్రమంగా లభిస్తాయి. 1990 ల ప్రారంభం నాటికిగాని ఆర్థిక సంస్కరణలు తుది రూపాన్ని సంతరించుకుంటాయి.

కాలం చెల్లిన సాంకేతిక పరిజ్ఞానంతో రాత్రికి రాత్రే అత్యున్నత ప్రపంచస్థాయి నందుకోలేము. యిందుకు ప్రప్రథమంగా సముచితమైన సాంకేతిక పునాదిని నిర్మించుకోవాలి. శ్రామిక బలగాలకు శిక్షణనిచ్చి ప్రవీణులను చేయాలి. దీన్ని త్వరత్వరగా చేయవచ్చు, కాని అకస్మాత్తుగా చేయలేము.

ప్రపంచంలో సాంకేతిక పురోగతి వేగంగా జరుగుతోంది. ఆర్థిక సంస్కరణలను తక్షణమే చేపట్టడానికి గల కారణాల్లో ఇ దొకటి సామాజికాంశం, అంటే ప్రజల మనోభావాలు కూడా నిర్వహించాల్సిన పాత్ర వుంది. ప్రజలు నిరీక్షించి, నిరీక్షించి, గాలికబుర్లు విని, విని విసిగెత్తిపోయారు. ప్రజల మనో భావాలను మొత్తంగా ప్రతిబింబించే అత్యంత తీవ్ర సమస్య యిది.

మరో కారణం. సోవియట్ యూనియన్ వ్యవసాయరంగాన్ని ప్రక్షాళన చేయాల్సిన అవసరం యెంతో వుంది. పరిశ్రమను సంస్కరించకుండా వ్యవసాయ సంస్కరణలను అమలు జరపడం అసాధ్యం. కొందరు అప్పుడప్పుడు విషయాన్ని చాలా తేలిక చేసి చెప్తారు: సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు స్వస్తి చెబుదాం, అందులోని సభ్యులందర్నీ కుటుంబ కాంట్రాక్టుల ప్రకారం పనిలో పెడుదాం. ఒకటి, రెండు సంవత్సరాల్లో మన సమస్యలన్నీ తీరిపోతాయి అని వారంటారు ఫలానా ఫలానా బృందాలు కాంట్రాక్టు పద్ధతి ప్రకారం పనిచేస్తున్నాయి; వాటి వుత్పాదకత రెట్టింపు అయింది, చూడండి అని అంటారు.

## సోవియట్ యూనియన్‌లో సంస్కరణల తక్షణావశ్యకత

ఇది లోతు తెలియని చాలా అమాయకమైన అభిప్రాయం. పాడి పంటల్లో వుత్పాదకత సమస్య ను యీ విధంగా పరిష్కరించలేము. ఉదాహరణకు, కుటుంబ కాంట్రాక్టు ద్వారా అమెరికా సగటున ఒక ఆవునుండి పొందే పాలను మనం పొందలేము. మనం పశు సంతతిని సమూలంగా మెరుగుపర్చాలి లేదా మార్చాలి. పశుగ్రాసోత్పత్తిని పెంచాలి పంగడాలను, కృషి పద్ధతులను మార్చాలి కృషి పద్ధతులు పరిశ్రమల పరిస్థితిని బట్టి వుంటాయి. యిప్పుడున్న దానికి పూర్తి భిన్నమైన వ్యవసాయ యంత్రనిర్మాణ పరిశ్రమ మనకుకావాలి. మనకు మరో విధమైన ఆధారరంగ పరిశ్రమ అవసరం: అంటే మరిన్ని మంచి రోడ్లు, ఎలివేటర్లు, కూరగాయలను భద్ర పర్చేగిడ్డంగులు, యింకా యితం అనేక సదుపాయాలు. యివన్నీ అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో కూడుకున్నవై వుండాలి.

పరిశ్రమల్లో మార్పు చేయకుండా వ్యవసాయోత్పత్తిని మరో యెనిమిదేళ్లలో కూడా పెంచలేము.

అందువల్ల నిజంగా విప్లవకర ఆర్థికసంస్కరణ సోవియట్ యూనియన్‌కు అవసరం. ప్రస్తుత మేనేజిమెంటు వ్యవస్థను రద్దుచేసి, సోషలిస్టు అభివృద్ధి స్థాయికి దీటైన నూతన మేనేజిమెంట్లు వ్యవస్థను నిర్మించ తలపెట్టాం.

అసలు విషయం యిది. ఆర్థిక జీవనంలో, మేనేజిమెంటు రంగంలో సోషలిస్టు సూత్రాలను మనం తరచు వక్రీకరించాం, యింకా వక్రీకరిస్తూనే వున్నాం. యీ వక్రీకరణలను తొలగించడం, మన సామాజిక వ్యవస్థకు గల శక్తి స్తోమతలకు విస్తృత అవకాశాలను ఆవిష్కరించడం — యిదీ సంస్కరణోద్యమ లక్ష్యం.

ఈ. వక్రీకరణ వల్ల, 70 లనాటి, 80 ల ప్రారంభంనాటి వ్యతిరేక పరిణామాల వల్ల ప్రస్తుత ఆర్థిక సంస్కరణలు అవసరమయ్యాయా? మన అభివృద్ధిలోని చారిత్రక వంకరటంకరవల్ల, తప్పించ వీలున్న లేదా వీలులేని యీ వంకరటింకరలవల్ల యివి అవసరమయ్యాయా? అని యెవరైనా అడగవచ్చు.

ఏదేమైనప్పటికీ ప్రస్తుత ఆర్థిక సంస్కరణలు అనివార్యమైనవని నా అభిప్రాయం. ప్రస్తుత మేనేజిమెంటు యేర్పడినప్పటినుండీ మన ఆర్థిక వ్యవస్థ నాటకీయంగా మారింది. సాంకేతిక రీత్యా, పరిధిరీత్యా, సామాజిక దృష్ట్యా, యీక్రమంలో పాల్గొన ప్రజల భాగస్వామ్యం దృష్ట్యా చూచినపుడు యిది మారింది. ఒకవేల వక్రీకరణలే లేని పక్షంలో సంస్కరణ మరో విధంగా వుండేదనే మాట నిజం. దీన్ని భిన్న పద్ధతుల్లో, భిన్నవేగంతో, తక్కువ శ్రమతో సాధించ వీలుండేది.

గత సంచిక తరువాయి

# సోవియట్ యూనియన్ అమెరికాల్లోని జీవితంపై ఒక అమెరికన్ అభిప్రాయం

అమెరికన్ రచయిత్రి, నరవర్గ చరిత్రకారిణి పాలాగార్ఫ్‌తో సంభాషణ ముగింపు భాగాన్ని దిగువనిస్తున్నాం:

**విలేకరి:** మీరు చెప్పినట్టుగా అమెరికా లోని నిరుద్యోగులు అంత దుస్థితిలో ఉంటే వారు సోవియట్‌యూనియన్‌కు ఎందుకు రావడం లేదు? ఈ ప్రశ్నను పాఠకులు అనేకసార్లు వేశారు.

**గార్ఫ్:** అందుకు వారిని అనుమతించక పోవడంవల్ల. 1920ల చివరన, 1930 ల ఆరంభంలో పాశ్చాత్య ప్రపంచం తీవ్ర ఆర్థిక మాంద్యంలో చిక్కుకున్నప్పుడు నిరుద్యోగులు సోవియట్‌యూనియన్‌కు వచ్చారు. ఆకాలంలో ఒక సత్సాంప్రదాయం నెలకొందనుకుంటాను. కాని యిది 1935-1936 లో స్టాలిన్ విదేశీయులను గురించి భయం రేకెత్తించినప్పుడు అకస్మాత్తుగా అంతమైంది. ఆచరణలో ప్రతి విదేశీయుణ్ణీ గూఢ చారిగానే చూడటం జరిగింది. సోవియట్ ప్రజలే గాక, లెనిన్ విజ్ఞప్తిపై వచ్చిన విదేశీయులు సైతం ఈగూఢచారులన్న ఉన్మాదంవల్ల అణచివేతకు గురయ్యారు.

**విలేకరి:** మాదేశంలోకి వస్తున్న విదేశీయుల సంఖ్య పెరిగితే వారికి మేము కల్పించజాలనట్టి ప్రత్యేక సౌకర్యాలు అవసరమా?

**గార్ఫ్:** ప్రత్యేక సౌకర్యాల ప్రశ్నే తలెత్తదు.

**విలేకరి:** ఎంతమంది అమెరికన్లు సోవియట్ యూనియన్‌కు రావాలనుకుంటున్నారని మీరు భావిస్తున్నారు?

**గార్ఫ్:** వారు వేలల్లోనే ఉంటారు.

**విలేకరి:** అమెరికన్లు చాలా కష్టపడి పనిచేస్తారని మీరంటున్నారు. అందుకు కారణమేమిటి? వారిలో ఏదన్నా ప్రత్యేకత ఉందా?

**గార్ఫ్:** దీనికి కారణం వారి పెంపకంలోనే ఉంది. పని చేయ్యకపోతే పనిలోనుండీ తొలగిస్తారన్న భయం ఒక కారణమైనా, అది ప్రధాన కారణంకాదు. అమెరికన్లు బాగా పనిచేయగలరన్న గతాను గతిక భావాన్ని సమాజం వారి మనసు కెక్కించింది.

**విలేకరి:** సోవియట్ ప్రజలు తమకున్న సామాజిక భద్రతవల్ల, నిరుద్యోగం లేక పోవడం వల్ల వారు బేఫర్వాగా ఉంటారని కొందరు నమ్ముతున్నారు.

**గార్ఫ్:** నేను కొన్ని కారణాలు చెబుతున్నాను. మొదటిది: కొందరు తమవేతనాలు తక్కువగా ఉండటంవల్ల పనిలో ఆసక్తి చూపడం లేదు. "నేను తెలివి తక్కువ వాడిని కాదు. నెలకు 100 రూబుళ్ళ కోసం నేనెందుకు కష్టపడాలి?" — ఈప్రశ్న తరచు వినవస్తూ ఉంటుంది. కాబట్టి, వారు రోజంతా టీ తాగుతూనో అటూ ఇటూ తిరుగుతూనో ఉంటారు. రెండవది: వేతనాలను

సోవియట్ యూనియన్ అమెరికన్ల జీవితంపై ఒక అమెరికన్ అభిప్రాయం

## పౌలా గార్బ్



ఒకేస్థాయికి దిగజార్చటం. మూడవది: పని ప్రదేశంలో నిజమైన క్రమశిక్షణ లోపించడం.

1960ల మధ్యలో నేనిక్కడికి వచ్చినప్పుడు జనం యెక్కువ ఆశాభావంతో ఉండటం, యెక్కువ నిబద్ధత కలిగి ఉండటం నాకు బాగా గుర్తు.

1960లలో నిలకడగా మంచి మార్పు జరుగుతుండేది: ప్రజలు తమ సొంత వాటాల్లో నివసించడం మొదలు పెట్టారు. టెలివిజన్, రెఫ్రిజిరేటర్, వాషింగ్ మిషన్ లాంటివి కొన్నారు. 1970ల ఆరంభంలో ప్రతి యేటా మంచి మార్పులు నాకు కనిపించాయి. వీటిని సోవియట్ ప్రజలు సైతం చూడగలిగారు.

1970లలో పరిస్థితులు అధ్వాన్నం కాకపోయినా స్తంభించాయి.

**విలేకరి:** ఇక్కడికి రావడంలో మీ ఉద్దేశాల్లో ఒకటి ఉన్నత విద్యాభ్యాసం. అలాగే, మీరు పైచదువులు చదివారు. మీపిల్లలు పెద్దవాళ్ళయ్యారు. ఇక్కడి మీనివాస హక్కు, మీపని హక్కూ తాత్కాలికం. మీభవిష్యత్తుకు భద్రతలేదని బాధపడడంలేదా ఒక్కమాటలో చెప్పాలంటే మీ పరిస్థితి అనిశ్చితం.

**గార్బ్:** పైగా, నేను అమెరికాలో పింఛన్ నిధికీ ఎలాంటి చెల్లింపులు చేయడంలేదు కాబట్టి అక్కడ నాకు పోగుపడేదేమీలేదు. సోవియట్ చట్టం నిర్దేశించిన సీనియారిటీ నాకు వస్తే ఇక్కడ పింఛన్ లభిస్తుంది. కానీ, నాపింఛన్ డాలర్లలో పంపడానికి అనుమతించినా 200 డాలర్లపై అమెరికాలో నెలరోజులు గడిచేది ఎలా? నాకేమన్నా అయితే ఎలా?

**విలేకరి:** మరి మీరు వెళ్ళిపోవడానికి ఎందుకు ఇష్టపడటంలేదు?

**గార్బ్:** నేనిక్కడ ఉండటానికి అలవాటు పడిపోయాను. మరో విషయం నేను వదిలి ఉండలేని మిత్రులు నాకిక్కడ ఉన్నారు.

**విలేకరి:** కాని, మీ అమ్మ అమెరికాలో ఉన్నారు కదా.

**గార్బ్:** ఆమెకెప్పుడు ఇష్టమైతే అప్పుడు యిక్కడికి రావచ్చు

**విలేకరి:** మీకు మీ అమ్మకన్నా మిత్రులు యెక్కువ ముఖ్యమన్నమాట. అవునా?

**గార్బ్:** అవును. కాని, మాఅమ్మను నేను అక్కడా, ఇక్కడా చూడగలుగుతాను కదా.

**విలేకరి:** కాని రెండేళ్ళ కొకసారి మాత్రమే

**గార్బ్:** నాది కఠిన హృదయం అని మీరు అనుకొనవచ్చు. కాని, అమెరికా ప్రమాణాల ప్రకారం యిది సరైనదే.

ఇక్కడి మానవ సంబంధాలు, మైత్రి అమెరికాలోని వాటికి పూర్తిగా భిన్నమైనవి. ఇక్కడివి మరింత బలమైనవి. అమెరికన్లకు మిత్రులు లేరని నాభావం కాదు. వారికీ మిత్రులున్నారు. అయితే వారిలో ఒకరిపట్ల ఒకరికి బాధ్యతాభావం ఉండదు. కాగా, ఇక్కడ స్నేహితులకు మానసికంగా, భౌతికంగా అటువంటి పరస్పర బాధ్యతాభావం ఉంది.

మరో విషయం. నేను అమెరికాకు వెళ్లిన ప్రతిసారీ అక్కడ నేరాలు విపరీతంగా పెరిగిపోవడం కనిపిస్తోంది. నేరాలను గురించి ప్రతి నిముషమూ ఆలోచించ వలసిన అవసరమే లేని దేశంలో నేను కాలం గడిపే కొద్దీ అమెరికాలో కొన్ని రోజులైనా నరే ఉండటం నాకు మానసికంగా కష్టమై పోతోంది.

విలేకరి: అమెరికాలో ప్రతి మలుపులోనూ దోపిడీ దారులు, హంతకులు లేక, మానభంగాలు చేయ డానికి పాల్పడేవారు తటస్థపడుతారని సాధారణ అభిప్రాయం.

గార్బ్: మాస్కోలో ఒకవారంలో మూడు, లేక నాలుగు హత్యలు జరిగాయని సోవియట్ పత్రికలో చదివినప్పుడు నేను భయపడకపోవడం అసంగతంగా కనిపించవచ్చు. కాని, మాస్కోకంటే మూడింతలు తక్కువ జనాభాగల శాన్‌ఫ్రాన్సిస్కోలో ప్రతిరోజు ఇదే సంఖ్యలో హత్యలు మరింత భయంకరంగా జరుగుతుంటాయి. వేసవిలో అక్క డుండిన మూడునెలల కాలమూ నాకు పీడకల అయింది. మాస్కోకు తిరిగి రాగానే నేను తేలికగా ఊపిరి పీల్చుకున్నాను.

విలేకరి: కాని, అమెరికాలో మీకు ఆదాయం ఎక్కువ వచ్చేది కదా.

గార్బ్: అది నిజమే కావచ్చు. కాని, నేనిలా అనుకుంటున్నాను.:

సోవియట్‌యూనియన్ విషయాల నిపుణు రాలిగా హార్వర్డ్ విశ్వవిద్యాలయం నాకొక మంచి ఉద్యోగమిచ్చి నెలకు 3,000 డాలర్లు యిచ్చినా ఆఉద్యోగం సంవత్సరం పాటైనా ఉంటుందనే నమ్మకంలేదు. చిత్తశుద్ధితో నేను పనిచేస్తే నాకిష్ట మైన న్నాళ్ళు ప్రగతి ప్రచురణాలయంలో నేను పనిచేయవచ్చు. మాటవరుసకు నా పరిస్థితి అనిశ్చితంగా కనిపించవచ్చు. కాని, వాస్తవంలో నాకు ఉద్యోగ భద్రత ఉంది.

విలేకరి: మీరు చెప్పినదాన్నిబట్టి పాదార్థిక సంక్షేమంకన్నా మీరు యెక్కువ విలువనిచ్చే విషయాలు జీవితంలో ఉన్నాయి. అయితే, ప్రతి ఒకరి విషయంలో అలా చెప్పలేము.

గార్బ్: నిజమే. తమ అవసరాలు వస్తుగతంగా అమెరికాలోకన్నా సోవియట్ యూనియన్‌లో యెక్కువగా తీర్చుకుంటున్నవారు ఉన్నారు. వారిలో నేనొకరిని. వేలాదిమంది అమెరికన్లు అక్క డికన్నా ఈదేశంలో తమ అవసరాలను మరింత బాగా తీర్చుకోగలరని నాకు తెలుసు. వేరే దేశాల్లో ఉంటే ఇక్కడికన్నా బాగుంటుందని అనుకునే వారు చాలామంది వున్నారని నాఅభిప్రాయం.

విలేకరి: అటువంటి వారి ప్రత్యేక లక్షణమేమి టి?

గార్బ్: స్థూలంగా చెప్పాలంటే వారిలో చాలామంది స్వార్థపరులు. తమ సంక్షేమమే వారికి ముఖ్యం. తమచుట్టూ ఉన్నవారు ఇబ్బంది పడు తున్నా పేదసాదలు, నిరుద్యోగులు ఉన్నా వారికి కొంచెంకూడా పట్టనేపట్టదు. నేను అమెరికాలో ఉండినప్పుడు యిదంతా చూచి ఎంతో బాధపడ్డా ను.

విలేకరి: క్షమించండి, సోవియట్ మహిళ జీవితం హాయిగా ఉందని మీరనడం నాకు ఆశ్చ ర్యకరంగా ఉంది. ఇక్కడా సమస్యలున్నాయి. డిష్ వాషర్లు లేవు. పాత్రలను చేత్తో కడగాలి. షాపుల ముందు క్యూలు.

గార్బ్: సాధారణంగా షాపులకు నాకొడుకులే వెడతారు. నాకు డిష్‌వాషర్ అమెరికాలో ఉన్నప్పు డూ ఉండేది కాదు. కొట్లలో లభించే సరకులతో నేను సంతృప్తి చెందుతున్నాను. నాకు వినియోగ దారీ మనస్తత్వం లేదు.

విలేకరి: మీరీ దేశాన్ని గురించి ఎంత ఉత్సా హంగా మాట్లాడుతున్నారంటే నాకు మీ నిష్పాక్షి కతపై సందేహం కలుగుతోంది. మీకు అమెరికా పైన అయిష్టత పెరిగినట్టు కనిపిస్తోంది.

గార్బ్: మీరూ, పాఠకులూ అలా భావిస్తే నేను తలకిందులైపోతాను. నేను నామాతృభూమినెంత గానో ప్రేమిస్తున్నాను. సృజనాత్మకత, విశాల ఉపజ్ఞా యుతమైన మనస్తత్వంలాంటి అమెరికన్ల సుగుణా లకు నేనెంతో విలువనిస్తున్నాను.

సోవియట్ వ్యతిరేక సమాచారం వినివిని విసు గెత్తింది కాబట్టి నాదేశస్థులు గత సంవత్సరాల్లో వలెగాక యిప్పుడు సోవియట్‌యూనియన్‌ను గురించిన నిష్పాక్షికమైన సమాచారం వినాలనే ఆతురతతో ఉన్నారు.

# స్టైచ్ అంటే ఏమిటి?



ఆసియా ప్రాంతానికి చెందిన తెల్లకొంగను రష్యన్‌లో "స్టైఖ్" అని అంటారు. పదేళ్ల క్రితం యీజాతి కొంగలు అంతరించిపోయే ప్రమాద మేర్పడింది. సోవియట్, అమెరికా శాస్త్రవేత్తల సంయుక్తకృషి యీజాతి కొంగలను కాపాడింది. "స్టైఖ్," స్టైచ్ అనే పదాల వుచ్చారణలో చాలా పోలికలున్నాయి. స్టైచ్ అనేది యిటీవలే రూపుగొన్న సోవియట్—అమెరికా సంయుక్త సంస్థ. పైన పేర్కొన్న విజయవంతమైన సహకారం గౌరవార్థం స్టైచ్ అనే పేరును దీనికి పెట్టడం జరిగింది. దీనిపూర్తిపేరు సిస్టమ్స్ ఆఫ్ టెక్నాలజీ ఫర్ రికన్‌స్ట్రక్షన్ ఆఫ్ కెమిస్ట్రీ.

స్టైచ్‌లో అమెరికా పక్షాన హనీవెల్ కంపెనీ, సోవియట్ యూనియన్ పక్షాన ఖనిజ ఎరువుల వుత్పత్తి మంత్రిత్వశాఖ భాగస్వాములు. పరిశ్రమలకు నియంత్రణా వ్యవస్థలను వుత్పత్తిచేసే ప్రపంచంలోని అతిపెద్ద కంపెనీ యీహనీవెల్. ఆకంపెనీ అధ్యక్షుడు మైఖెల్ బొన్‌సిగ్నోర్, సోవియట్ మంత్రి ఎన్.ఒల్‌షన్‌స్కీ యీ ఒప్పందంపై సంతకాలు చేశారు.

ఈసంయుక్త పరిశ్రమలో సోవియట్ మంత్రిత్వ శాఖ వాటా 51 శాతం; మిగతా 49 శాతం ఆస్ట్రియాలోని హనీవెల్ కంపెనీ అనుబంధ సంస్థది. మొదటి దశలో ఈసంస్థలో వుద్యోగులుగా 40 మంది సోవియట్ పౌరులు, ఒక అమెరికన్ (ఈసంస్థ డిప్యూటీ డైరెక్టర్ జనరల్) వుంటారు.

ఈఒప్పందం ప్రకారం వుత్పత్తి ప్రక్రియలకు సంబంధించిన ఇంజనీరింగ్, మార్కెటింగ్ వ్యవస్థల టెక్నాలజికల్ కేంద్రాన్ని, ప్రవీణుల శిక్షణా కేంద్రాన్ని మాస్కోలో యేర్పాటు చేస్తారు.

స్టైచ్‌కు తమ సంస్థ వంతుగా మొదట కొద్ది మొత్తం అంటే ఒకమిలియన్ డాలర్లు అందజేస్తానని మైఖెల్ బొన్‌సిగ్నోర్ తెలిపారు. యిది పని ప్రారంభించిన కొన్ని సంవత్సరాల్లోనే లాభాలు సంపాదించగలదని ఆయన అన్నారు.

డుపాంట్, డౌ కెమికల్, జనరల్ ఎలక్ట్రిక్, ఆక్సిడెంటల్ పెట్రోలియం తదితర అమెరికన్ సంస్థలతో సోవియట్ సంస్థలు సంబంధాలు పెట్టుకున్నాయి.

ఖనిజ ఎరువులను **వుత్పత్తి** చేస్తున్న సోవియట్ ఫ్యాక్టరీలను ఆధునికీకరించడం, హనీవెల్ కంపెనీ అభివృద్ధిచేసిన అధునాతన నియంత్రణ, స్వయంచలిత వ్యవస్థలతో వాటి వుత్పత్తిని పెంచడం స్టైచ్ ప్రధాన కర్తవ్యంగా వుంటుందని ఖనిజ ఎరువుల వుత్పత్తి మంత్రిత్వశాఖ తాలూకు ప్రధాన శాస్త్ర సాంకేతిక పరిపాలనా విభాగ డిప్యూటీ చీఫ్ గియోర్గి ప్రిత్కో తెలిపారు. ప్రపంచ మార్కెటుకు తగిన స్థాయిలో వుత్పత్తి ప్రక్రియలకు చెందిన స్వయంచలిత నియంత్రణా వ్యవస్థలను తయారుచేసే కర్మాగారాలను తర్వాతిదశలో సోవియట్ యూనియన్‌లో నిర్మిస్తామని ఆయన వివరించారు.

ఉత్పత్తి ప్రక్రియల నియంత్రణా వ్యవస్థల తయారీ రంగంలో లాభసాటైన వ్యాపార సహకారానికి ప్రస్తుత ఒప్పందం మంచి అవకాశాన్ని సమకూరుస్తోందని హనీవెల్ సీనియర్ వైస్—ప్రెసిడెంట్ జేమ్స్ వెర్రాంట్ అన్నాడు.

# ఆర్థిక సహకార వార్తలు




తెర్మజ్ సముద్రానికి కొన్ని వేలమైళ్ల దూరంలో వుంది. అయినప్పటికీ అమూదర్యాపైగల దీని రేవునుండీ అఫ్గనిస్తాన్ నదీరేవులైన షెర్ఖాన్, హైరాటన్‌లకు సోవియట్ సరకుల్లో యెక్కువ భాగం చేరవేస్తున్నారు.

ఉజ్బెక్ ట్రేడ్స్ సోవియట్ వినిమయదార్ల సహకారసంస్థకూ, అఫ్గన్ వుత్తర రాష్ట్రాలకూ మధ్య వ్యాపారం అభివృద్ధి చెందుతోంది. యీ వ్యాపార సేవా కేంద్రం తెర్మజ్‌లోకూడా వుంది. దీని అధిపతి 35 ఏళ్ల పట్టభద్రుడు భక్తియార్ కదీరోవ్ తెలియజేసినది:

"ఉజ్బెక్ వినిమయదార్ల సహకార సంస్థల యూనియన్‌కూ, అఫ్గన్ టోకు వ్యాపార సంస్థ అయిన దస్తీకి మధ్య రెండేళ్ల క్రితం యిక్కడ తెర్మజ్‌లో మొదటి ఒప్పందం కుదిరింది. యిప్పటికీ యీమార్గాన దాదాపు 2.5 మిలియన్ రూబుళ్ల విలువగల సోవియట్ సరకులను ఎగుమతి చేశాం; 3.3 మిలియన్ రూబుళ్ల విలువగల అఫ్గన్ సరకులను దిగుమతి చేసుకున్నాం. మేము పారిశ్రామిక సరకులను ఎగుమతి చేస్తున్నాం. అఫనిస్తాన్‌నుండి చాలావరకు వ్యవసాయ వుత్పత్తులను దిగుమతి చేసుకుంటున్నాం.

"బరాత్ కంపెనీతో మేము ఇటీవలే ఒక ఒప్పందం కుదుర్చుకున్నాం. తాష్కెంట్‌లో 'బాల్ఖ్' రెస్టారెంట్‌ను, 'కాబూల్' షాపును తెరవడానికి సంబంధించిన ఒప్పందమిది. సుర్ఖాన్‌దర్యా మండలంలో ద్రాక్షపండ్లను శుద్ధిచేసేందుకు సంయుక్త పరిశ్రమను యేర్పాటు చేయడంకూడా యీ ఒప్పందంలో వుంది.

"పశ్చిమ యూరప్‌లో తయారైన పళ్ల శుద్ధి స్వయంచలిత పరికరాలను, ప్యాకేజి పరికరాలను అందమైన పెట్టెలను, యితర వస్తువులను అఫ్గన్ పక్షం అందవేస్తుంది.

"ఉజ్బెక్ డిజైన్ ఇన్‌స్టిట్యూట్ డిజైన్ ప్రకారం ఉజ్బెక్ వినిమయదార్ల సహకార సంస్థ, డెనావ్ మండల కేంద్రంలో యీసంస్థను నిర్మిస్తుంది. యీసంయుక్త పరిశ్రమలో సోవియట్ వాటా 51 శాతానికి తగ్గకుండా వుంటుంది.

"ఉజ్బెక్ వినిమయదార్ల సహకారసంస్థ సప్లయి చేయనున్న వస్తువుల్లో అఫ్గనిస్తాన్‌కు అవసరమైన వస్తువులను పరిశీలించే పనిని అఫ్గన్ ప్రైవేయిట్ సంస్థ అయిన కిఫాయత్‌కు అఫ్గనిస్తాన్ అప్పగించింది. యిందుకు "ఉజ్బెక్ ట్రేడ్స్" బోర్డు తన ఆమోదం తెలిపింది. ఎయిర్ కండిషనర్లను, కలప, ఎనామిల్ వస్తువులను, కిటికీ గ్లాసును, యితర వస్తువులను అఫ్గన్ సంస్థ ఎంపిక చేసింది.

"అఫ్గన్ వర్తకులు హెుజాఫహరుద్దీన్, మొహమ్మద్ రసూల్ బరాత్ హాజిరుహుల్లో, హాజిహిక్మతుల్లా, ఖాన్‌షిరిన్‌తో మేము సంబంధాలు పెట్టుకున్నాం. వీరు ఉత్తర అఫ్గన్ రాష్ట్రాల్లో ప్రసిద్ధ వర్తకులు వీరితో మేము 12.3 మిలియన్ రూబుళ్ల విలువగల కాంట్రాక్టులను కుదుర్చుకున్నాం.

"వాణిజ్యం శాంతికి రాయబారి. తమ యిరుగు పొరుగు దేశాలతో స్నేహాన్ని, శాంతిని అఫ్గన్లు కోరుకుంటున్నట్లు, తమ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసుకోదలచుకున్నట్లు ఆర్థిక, వాణిజ్య సంబంధాల అభివృద్ధిపట్ల వారికిగల ఆకాంక్ష తెలియజేస్తోంది."










ప్రపంచ మహాసముద్రాల్లోగల ఖనిజ సంపద గురించి సోవియట్ ప్రవీణులు జరిపిన అన్వేషణ దాని ఫలితాల పై ప్రపంచ మహాసముద్రాల ఖనిజ వనరుల, భూగర్భ విషయాల అఖిల యూనియన్ పరిశోధనా ఇనిస్టిట్యూట్ డైరెక్టర్ ఇగోర్ గ్రామ్ బెర్గ్ వివరణ.

ఈనాడు చంద్రోపరితలంకన్నా ప్రపంచ మహాసముద్ర గర్భం గురించి తెలిసింది చాలా తక్కువ. నట్టనడి సముద్రాల్లో, ప్రత్యేకించి తీర ప్రాంత సముద్రాల్లో ఖనిజ నిక్షేపాలకోసం జరిపే అన్వేషణ ఫలితాలు స్వల్పకాలికమైనవిగానే వుంటున్నాయి.

ప్రపంచ మహాసముద్రగర్భం పరిస్థితి యెప్పటికప్పుడు మారుతుంది. అది రూపుగొనే క్రమం నేటికి సాగుతోంది. అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రాల గర్భాల్లోని బీటలు బారిన మండలాల్లో అగ్ని పర్వతాలు, వీటిలో లోతైన పగుళ్లు కనిపించాయి. భూమి పైపొరకు సంబంధించిన భాగాలు కదులుతున్నట్టు యీ పగుళ్లు తెలియజేస్తున్నాయి.

ప్రపంచ మహాసముద్రాన్నిగర్భాన్ని తీరప్రాంత మండలంగానూ, లోతైన సముద్రగర్భ మండలంగానూ చేసిన విభజనను అందరూ అంగీకరించారు. సముద్రనిక్షేపాలను కనుగొనడానికి యీ విభజన యెంతో అవసరం. సముద్రతీరప్రాంతం వాస్తవంలో భూఖండం కొనసాగింపే. 200 మీటర్ల లోతువరకుగల సముద్రప్రాంతాన్ని తీరప్రాంత సముద్రమండలంగా పరిగణిస్తున్నారు. యీప్రాంతంలో భూగర్భంలో లభించే ఖనిజాలే లభిస్తున్నాయి. యీ పరిజ్ఞానం సోవియట్ యూనియన్‌కు యెంతో ముఖ్యం. యెందుకంటే సోవియట్ యూనియన్‌కు సువిశాలమైన తీరప్రాంతసముద్రమండలం వుంది.

చాలా కాలంవరకూ ఖనిజాల అన్వేషణ తీరప్రాంతమండలాల్లోనే కేంద్రీకరించడం జరిగింది. దీని ఫలితంగా వందలాది ఖనిజనిక్షేపాలు బయటపడ్డాయి. యీ అన్వేషణవల్ల హైడ్రోకార్బన్లు సమృద్ధిగా లభించాయి. సాలీనా ద్రవరూప హైడ్రోకార్బన్లలో మూడింట ఒకవంతు సముద్రాలనుండే లభిస్తున్నది. తీరప్రాంత సముద్రాల్లో తగరం, బంగారం, వజ్రాలు, యితర ఖనిజాలు లభిస్తున్నాయి.

ఇక లోతైన సముద్రగర్భాల్లో ఇనుము, మాంగనీసు గులకల నిక్షేపాలు వున్నాయి. సల్ఫైడ్ ఖనిజాలు పుష్కలంగా వున్నాయి. భూమ్మీద యివి యీరూపంలో లభించవు.

సోవియట్ భూగర్భశాస్త్రవేత్తలు గ్యాస్‌హైడ్రేట్స్ అనే గట్టి పదార్థాలను కనుగొన్నారు. యిది మంచును పోలివుంటుంది. సముద్రంనుండి వెలికితీస్తే ఇది మంచులాగా కరిగిపోతుంది. యివి మిథేన్, నీరు అంశీభూతాలుగా వున్న పదార్థాలు. యివి అధిక పీడన, సున్నా ఉష్ణోగ్రత పరిస్థితుల్లో రూపుగొంటాయి. యీపరిస్థితి సముద్రగర్భంలో

వుంటుంది. సముద్రగర్భంలో మడ్డి కుదురుకొని గట్టిపడి యేర్పడిన గండశిలల రంధ్రాల్లో, కుహరాల్లో, యీ పదార్థాలు చేరుతాయి. మనం వాడే ఖనిజ వాయువు అవసరాలను యిది పూర్తిగా తీర్చగలదని శాస్త్రవేత్తల అభిప్రాయం. యీ గ్యాస్ హైడ్రేట్స్‌ను గురించి కెనడా జియలాజికల్ సంస్థతో సంయుక్తంగా సోవియట్ భూగర్భశాస్త్ర వేత్తలు అధ్యయనం చేస్తున్నారు.

# సముద్ర లోతు లోతేమిటి?

ఇక ఇనుము, మాంగనీసు గులకలుగల లోతైన సముద్రమండలాల గురించి. ముత్యాలు యేవిధంగా తయారౌతాయో బహుశా అందరికి తెలును. ఇసుక రేణువు ఆలిచిప్పలోకి చేరినపుడు దానిపై ముత్యపుపొరలు యేర్పడు తాయి. ఈగులకలుకూడా **అంతే**. గులకరాళ్ళు, సొరచేపవళ్లు, దాని నోటి ఎముకలు—యివి మిలియన్లాది యేళ్ల పాటు నాలుగైదు కిలోమీటర్ల లోతు సముద్రపు నీటిలో పడివున్నపుడు వాటిపై ఇనుము, మాంగనీసు ద్రావణపు పొరలు యేర్పడి గులకలుగా రూపుగొంటాయి. యీగులకల్లో లోహాల శాతం చాలా యెక్కువ వుంటుంది; మాంగనీసు 25 శాతం, ఇనుము 14 శాతం, నికెల్ 1.9 శాతం, రాగి 0.5 శాతం, కోబాల్ట్ 0.4 శాతం. యీ గులకల్లో సీసం, రేడియో ధార్మికశక్తిగల అరుదైన లోహాలుకూడా కొద్ది మోతాదుల్లో వుంటాయి.

సముద్రగర్భంలో ఇనుము, మాంగనీసు గులకలుగల ప్రాంతాలున్నాయి. భూమధ్యరేఖకు ఉత్తరదిశలో పసిఫిక్ సముద్రంలోని క్లెరియన్—క్లిప్పర్టన్ విశాలక్షేత్రం యెంతో ఆసక్తికరమైనది. యీక్షేత్రంలో ఇనుము, మాంగనీస్ అత్యధిక శాతంలోగల గులకలు వాటిలో ఎక్కువ పరిమాణంలో ఖనిజాలు వున్నాయని అన్నిదేశాల ప్రవీణుల అభిప్రాయం.

సముద్రగర్భంలో యిటీవల పాలీమెటాలిక్ సల్ఫయిడ్ ఖనిజాలను కనుగొన్నారు. యివి ముఖ్యంగా రెండు మూడు కిలోమీటర్ల లోతున హైడ్రోథర్మిక్ ద్రావణాలు వెలువడే పగుళ్లున్న చోట లభిస్తున్నాయి.

ఈ పాలిమెటాలిక్ సల్ఫయిడ్ ఖనిజాల సాంద్రత పరిమాణాన్ని, అవి రూపుగొనే విశాలమైన ప్రాంతాలను కనుగొనడం సముద్రగర్భశాస్త్ర ప్రధానకర్తవ్యం. యీఖనిజాలు యేమేరకు వుపయోగపడుతాయో యిప్పుడే చెప్పలేం.

అధునాతన పరిశోధనా నౌకలతో సముద్ర సంపదను యిప్పుడు అన్వేషిస్తున్నారు. అవి అకాడమిక్ కార్పిన్‌స్కీ, జియోలాగ్ పెర్స్‌మన్, జియోలాగ్ సలివ్‌కిన్. భవిష్యత్తులో సముద్రగర్భంలోని సంపద అన్వేషణను, వెలికి తీతను మైక్రోప్రాసెసర్స్ ద్వారా, మరమనుషులద్వారా సుదూరంనుండే నిర్వహించడం జరుగుతుందనే మాట నిజం.

# సోవియట్ చరిత్ర గురించిన భిన్న దృక్పథాలు

**అనతోలి బ్యుతెంకో, పిహెచ్.డి వయస్సు 65. సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ లోని ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ విషయాల అర్ధశాస్త్రం .ఇన్స్టిట్యూట్‌లో ఒక శాఖ అధిపతి. ఆయన సామాజిక శాస్త్రాల్లో నిష్ణాతుడు.**

**1977 నాటి సోవియట్ రాజ్యాంగంతో సహా అనేక పత్రాలను రూపొందించడంలో పాల్గొన్నారు. ప్రస్తుతం ఈయన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర రచిస్తున్న పండితుల్లో ఒకరు.**

సోవియట్ చరిత్ర అంటే సోవియట్ సమాజాన్ని దాని గత, ప్రస్తుత నమన్యలను అర్థం చేసుకోవడం మాత్రమేకాదు. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలోని అనేక నమస్యల చిక్కుముడులను అంతర్జాతీయ స్థాయిలో విప్పవలసిఉంది. సోవియట్ చరిత్రలోని ఉజ్వల ఘట్టాలనుగానీ, విషాదకాలాన్ని గానీ. అతిగా చిత్రించకుండా జాగ్రత్త పడాలి.

చరిత్ర రచనలో సోవియట్ పండితులందరూ మార్క్సిస్టు-లెనినిస్టు పద్ధతినీ, చారిత్రక భౌతిక వాదాన్నీ ఉపయోగిస్తున్నారు. అయినా మనం వేర్వే రు నిర్ధారణలకు వస్తున్నామెందుకు? అధ్యయన పద్ధతులూ, వాస్తవాలేగాక ఒకానొక చారిత్రక కాలంలోని నమస్త దశలను అనుసంధించే ఒక భావన ఉండాలి. అది వుండడం లేదు.

వేర్వేరు చరిత్రకారుల వేర్వేరు భావనలు ఒకే ఘటనను వేరు రీతుల్లో చిత్రించడానికి దారి తీస్తాయి. యిదీకారణం.

1930 ల నాటి సామూహిక దమనకాండనే తీసుకుందాం. అప్పటికే అధి కారం నిజంగా శ్రామిక వర్గం చేతిలోనే ఉందని అంగీకరిస్తే కార్మిక వర్గం అప్పటికి పూర్తిగా ఎదగలేదని మనం ఒప్పుకోవాల్సి వస్తుంది. మధ్యతరగతి రైతుల, దోపిడీ దారులైన కులక్కుల చేతినుండీ ఆస్తులను లాగి వేసి ఆదేశ పూర్వక వరి పాలనను ప్రవేశపెట్టడం జరిగింది. యెల్లెడలా "ప్రజల శత్రువు" లను ఏరివేయడంలో దేశంలోని అత్యుత్తములకు కూడా హానిజరిగింది. అయితే, గడ్డు పరిస్థితి అప్పటికే గడచి పోయింది. కోటాను కోట్లమంది ప్రజలు సోలిజం నిర్మాణరంగం లోకి దూకారు. తొలి విజయం రేపోమాపో సిద్ధించనుంది. కానీ, దీన్ని కార్మిక వర్గం అర్థం చేసుకోలేక పోయింది. శ్రామిక వర్గ అధికారం దేశంలో అసహిష్ణుత, శత్రుత్వం, అనుమానాలతో కూడిన వాతా వరణాన్ని సృష్టించింది; శ్రామికవర్గం వర్గపోరాటాన్ని తీవ్ర తరం చేసి చట్టవిరుద్ధ చర్య లకు ఒడి గట్టింది. సామాజిక దమనకాండకు పూనుకుంది. ఇది నాటి ఘటనలను చిత్రించిన ఒక తీరు.

మరొక అభిప్రాయంవుంది. ఇదిసత్యానికి దగ్గ గా ఉందని నా భావం. అదేమిటంటే, జోసెఫ్ స్టాలిన్ ఆయన పరివారం లెనిని జానికి విధేయులమై యున్నామనీ, కార్మిక వర్గం తరపున వ్యవహరిస్తున్నామనీ చెప్పుకుంటూనే, తమవ్యక్తిగత అధికారాన్ని పటిష్టంచేసుకున్నారు: భిన్నాభిప్రాయంగలవారికి ప్రజాశత్రువులుగా ముద్రవేసి, వారిని యమయాతనలు పెట్టారు. ఈ విధంగా కార్మిక వర్గాన్ని రాజకీయాధికారానికి దూరంగా ఉంచారనీ నాటి అధికారాన్ని అక్రమంగా చేజిక్కించుకున్న వీరే దీనికంతటికీ బాధ్యత వహించాలనీ ఈ రెండవ దృక్పథానికి అర్థం.

మరోసమస్యను — ఇంతకన్నా పెద్దదైన సిద్ధాంత సమస్యను — సోవియట్ సమాజాభివృద్ధిలో, సోషలిజం నిర్మాణంలో కీలక దశలసమస్యనే తీసుకుందాం.

ఎవరైనా స్టాలినిస్టు వైఖరితో సోషలిజాన్ని చూస్తే, సామాజికీకరణను ఉత్తర్వులద్వారా నిర్వహించడమే, ఉత్పత్తి సాధనాలు రాజ్యవ్యవస్థ అజమాయిషీలో ఉండటమే ముఖ్యవిషయం, మిగతాదంతా అప్రధానం అనీ అనిపిస్తుంది. కాబట్టి, చరిత్రకారుడు ఎం.ఐ.కిమ్ రాసినట్టుగా 1930 ల చివర్లోనే సోవియట్ యూనియన్‌లో సోషలిజం విస్తృత నిర్మాణం జరిగిపోయినట్టుగా వారు చెప్తారు.

కానీ, లెనిన్ ఏమన్నాడో జ్ఞాపకం చేసుకుందాం. సోలిజానికి ఆర్థిక వ్యవస్థ ప్రాతిపదిక అయినప్పటికీ సోషలిజం అదొక్కటేకాదు. విస్తృత స్థాయిలో సోషలిస్టు అభివృద్ధికీ, వ్యక్తి పూజా విధానం పెంపుదలకూ పొసగుతుందా అన్నప్రశ్న ఉత్పన్నమవుతోంది. వ్యక్తి పూజ ద్వారానే స్టాలిన్, ఆయన పరివారం కార్మిక వర్గాన్ని అధికారం నుంచీ దూరంగా ఉంచి సోవియట్ దేశ అత్యుత్తమ పౌరులపై సామూహిక దమనకాండను సాగించడం చట్టవిరుద్ధ పాలనను, నిరంకుశత్వాన్ని తెచ్చిపెట్టడం జరిగింది.

ప్రభుత్వ ఆస్తిగా చేయబడిన ఉత్పత్తి సాధనాలను వీరిపాలనలో కార్మిక వర్గం నుండీ లాగేసుకోవడం, ఉత్పత్తి ప్రత్యక్ష నిర్వహణలో దానికెలాంటి పాత్రాలేకుండా చేయడం జరిగింది. సర్వోన్నత నాయకుని వ్యక్తిత్వం గురించిన మూఢవిశ్వాసం రాజ్యమేలింది.

చరిత్రను గురించిన సరైన అభిప్రాయానికి రావడం అంతసులభంకాకపోయినప్పటికీ ఒకే ఒక అభిప్రాయం మాత్రమే శాస్త్రీయ పరిశీలనా పద్ధతికి అనుగుణంగా ఉండగలదు. ఇదే సాధారణ సిద్ధాంతరంగంలో పరిశోధన ప్రయోజనం. కొన్ని సర్వసాధారణ భావనలు కొన్ని సమయాల్లో మార్క్సిజం ముసుగులో చలామణీ అవుతున్నప్పటికీ, మౌలికంగా అవి మార్క్సిజానికి విరుద్ధమైనవి. కాబట్టి, వాటి అసలు రంగు బయట పెట్టాలి.

**1920 ల 1950 ల కాలంపై భిన్న అభిప్రాయాలు.**

ఈకాలానికి సంబంధించి మనం రెండు ప్రధాన భావనలను పరిశీలించాలి. మనం ఆనాటి విజయాలను కీర్తించి, మొరటు వక్రీకరణల ప్రాధాన్యాన్ని తగ్గించి చూపాలని స్టాలినిస్టు వ్యాఖ్యాతలు చెబుతున్నారు. తనవైఖరియే లెనినిజం అనీ, సోషలిజాన్నిగురించి, దానికి చేరే మార్గాన్ని గురించి తనవ్యక్తిగత అభి ప్రాయమే శాస్త్రీయ కమ్యూనిజమనీ చెప్పుకుంటూ, స్టాలిన్ తన అభిప్రాయాలతో ఏకీభవించని పార్టీ ప్రముఖులు (ట్రాట్స్కీ, [illegible] కామెనేవ్, బుఖారిన్ తదితరులు) నిజానికి లెనినిజంనూ. తననూ, వ్యతిరేకిస్తున్నారని ఆరోపించారు. తనకు వీరివలె సొంత అభిప్రాయాలు లేవనీలెనినిస్టుఅభిప్రాయాలనే తాను అనుసరిస్తున్నాననీ ఆయన చెప్పుకున్నారు. స్టాలిన్ తప్పులు చేయరనీ, ప్రతిపక్షంమాత్రమే తప్పుచేస్తుందని చెప్పుకుని ట్రాట్ స్కీయిజం తదితరాలతో పోరాటాన్ని సమర్థించుకున్నారు. సమిష్టీకరణను బలవంతంగా రుద్ది మధ్యతరగతి రైతుల ఆస్తి లాగివేసుకోవడం, సోషలిజానికి చేరువయ్యే కొద్దీవర్గపోరాటం తీవ్రతరమవుతుందన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం, 1930 ల లో సామూహిక హింసాకాండ, చట్ట వ్యతిరేక చర్యలకు పాల్పడటం బ్యూరాక్రాట్లతో షరీకుకావడం, రాజ్యాధికారం క్రమంగా దుల్లిపోతుందన్న సూత్రాన్ని తిరస్కరించడం — యివన్నీ సోవియట్‌యూనియన్‌లో సోషలిజం ఆశయానికి తీరని హాని కలిగించాయి.

ఆ దశాబ్దాల గురించిన మార్క్సిస్టు అవగాహన పూర్తిగా వేరు. స్టాలిన్ సిద్ధాంతాలు గతితర్కంతో, భౌతిక వాద సిద్ధాంతంతో పొత్తులేకుండా లెనినిజాన్ని అతిగా సరళం చేశాయి; యివి సహించరాని తప్పిదాలకూ, ఘోరమైన పొరబాట్లకూ దారితీశాయి.

# సోవియట్ చరిత్ర గురించిన భిన్న దృక్పథాలు

స్టాలిన్ లెనినిజం నుండీ యెప్పుడు వేరుపడ్డారని తెలుసుకునేందుకు సామాజిక శాస్త్రజ్ఞులు, చరిత్ర కారులు స్టాలిన్ వైఖరుల పరిణామ క్రమాన్ని పరిశోధించవలసి ఉంది. లెనిన్ మరణించినపుడు స్టాలిన్ కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శిగా వున్నారు. అప్పుడు స్టాలిన్ తన నిర్ధారణలు, చర్యలు శాస్త్రీయమైనవనీ, అవి మార్క్సిస్టు-లెనినిస్టు స్వభావం కలవనీ చెప్పారు ప్రపంచ తొలి సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి యెంతత్యాగమైనా చేయడానికి సిద్ధంగా ఉన్న ప్రజల విప్లవాత్మక స్ఫూర్తిని దుర్వినియోగం చేసి జోసెఫ్ స్టాలిన్ లక్షలాది మంది దేశ వుత్తమ పుత్రీపుత్రులను ప్రగతి పీఠంపై బలి పెట్టారు. సమస్త సామాజిక-ఆర్థిక విజయానికీ, పారిశ్రామికాభివృద్ధికీ తమ నాయకుని అపారమేధో ప్రతిభా సామర్థ్యాలే కారణమని ఆయన పరివారం ప్రచారం చేసింది.

మార్క్సిజం - లెనినిజానికి స్టాలిన్ వ్యాఖ్యానాన్ని నేటికీ నమ్మేవారు కేవలం అలవాటు వల్లా, లేదా అజ్ఞానంవల్లా అలా చేస్తున్నారు. అసలు విషయం ఏమిటన్నది నిరూపించడం చరిత్ర కారుల కర్తవ్యం. స్టాలిన్ అక్టోబర్ విప్లవానికి ముందే కొన్ని పెద్ద తప్పులు చేశారు.

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్‌ను సృష్టించడానికి సంబంధించిన జాతుల సమస్య విషయంలో • స్టాలిన్ అభిప్రాయాలు లెనిన్ అభిప్రాయాలకు భిన్నమైనవి. లెనిన్ సమాన ప్రతిపత్తిగల రిపబ్లిక్కుల స్వచ్ఛంద సమ్మేళనకు పిలుపివ్వగా, స్టాలిన్ రష్యన్ రిపబ్లిక్ పరిధిలో "స్వయం పాలిత రిపబ్లిక్కులను ఏర్పరచా" లని అన్నారు. యిది వెంటనే జాతుల మధ్య ఘర్షణలకు దారితీసింది. యివిస్టాలిన్ ప్రతిపాదన ఎంతపొరపాటో, అకాలికమో, రుజువు పర్చాయని లెనిన్ చెప్పారు.

లెనిన్ మరణించినప్పుడు స్టాలిన్ తాను లెనిన్ భావాలకు కట్టుబడి ఉన్నట్టు చెప్పుకోవడం కొనసాగించారు. కాని, వాస్తవానికి ఆయన లెనిన్ భావాల నుండీ అంతకంతకూ ఎక్కువగా వైదొలగసాగారు, వాటిని తిరగతోడ సాగారు• ఉత్పత్తి ఖర్చుల మదింపు వ్యక్తి గత ఆర్థికలాభం, కార్మికుల క్రియాశీల భాగస్వామ్యం, సరకు సంబంధాల విస్తృత వినియోగం; మేనేజిమెంటులో కార్మికుల పాత్ర, మొదలైన వాటిద్వారా సోషలిజాన్ని ప్రతిపాదించే నూతన ఆర్థిక విధానం (నెప్) పట్ల స్టాలిన్ తన సొంతవిధానాన్ని అవలంబించారు. నెప్ "తాత్కాలిక వెనుకడుగు" అని ఆయన భావించారు. **1920 ల చివరలో నెప్‌ను త్రోసివుచ్చి, "పెట్టుబడి దారీ విధానంపై దాడికి, పూనుకున్నారు. దీనర్థం పార్టీ, ప్రభుత్వ ఆదేశపూర్వక పాలనకు మళ్ళడమేనని తేలింది. యిది విస్తృత పర్యవసానాలకు దారి తీసింది.**

**లెనినిజానికి స్టాలిన్ తరహా ఆదేశ పూర్వక సోషలిజం తావు లెకుండా చేయ**నారంభించింది. **1920**ల అంతంలో **1930**ల ఆరంభంలోనే "శారీర కంగా ప్రాభావితం" చేసే పద్ధతులను (చిత్రహింస) స్టాలిన్ చట్టబద్ధంచేసింది, దేశవ్యాప్తంగా మిలియన్లకొద్దీ అమాయకులను జైళ్ళకూ, ప్రవాసానికి పంపిందీ ఆదశలోనే.

**1930 లలో స్టాలిన్ ట్రాట్స్కీ వాద** భావాలు. **కొన్నింటిని అమలు జరిపిన సంగతి** రహస్యమేమీ కాదు. ఇవి "స్క్రూలు గట్టిగా బిగించే" విధానం, ప్రభుత్వ యంత్రాంగాన్ని "కుదిపే" విధానాన్ని **అవలంబించడం;** ప్రజాస్వామ్యాన్ని వాక్ స్వాతంత్ర్యాన్ని **అణచివేయడం;** లెనిన్ సహకార **పథకాన్ని తిరగతోడటం; కార్మిక వర్గానికి, మధ్య తరగతి రైతాంగానికి అనుబంధాలు తెగ్గొట్టడం మొదలైనవి. యిక, ఆయన సాగించిన సామూహిక దమనకాండ, పాశవిక కృత్యాలు మార్క్సిజంకు, లెనినిజంకు పూర్తిగా విరుద్ధమైనవి. సోషలిజం నిర్మాణాన్ని గురించిన లెనిన్ సూత్రలను యిది పూర్తిగా తిరగతోడటమే. సోషలిజం కోసం భక్తి విశ్వాసాలతో పాటుపడే పార్టీ కార్యకర్తలను, సైనిక, ఆర్థిక రంగాలలోని వారిని ఆయన అణచి వేశారు. సోషలిజం దగ్గరపడేకొద్దీ వర్గపోరాటం అని వార్యంగా తీవ్రతరమవుతుందన్న ఒక తప్పుడు సిద్ధాంతాన్ని ఆయన ప్రతిపాదించారు. దీనికి మార్క్సిజం—లెనినిజంతో యెటువంటి పొత్తూలేదు.** యిది కేవలం స్టాలినిస్టు సూత్రీకరణ. తనకు నచ్చనివారిని పాశవికంగా అణచి **వేసేందుకు సైద్ధాంతిక కారణాలను సమకూర్చు కోవడానికై ఆయన కల్పించిన సూత్రమిది.**

స్టాలిన్ విదేశాంగ విధానాన్ని కూడా నికరమైన లెనినిస్టు విధానమని చెప్పజాలము• హిట్లర్ నాయకత్వం

వహించిన జర్మనీతో యుద్ధానికి తగిన సన్నాహాలు చేయకుండా స్టాలిన్ కొన్ని పొరపాటు అంచనాలను నమ్ముకొన్నారు. మరింత సమర్థులైన లెనినిస్టు రాజకీయనాయకులు ఈ విషయంలో మరొక విధంగా వ్యవహరించి ఉండేవారు. యుద్ధం సంభవించనున్న సమయంలో సోవియట్ యూనియన్ అంతర్జాతీయంగా ఏకాకి అయిపోకుండా తప్పించే విదేశాంగ విధానాన్ని కనుగొని ఉండేవారు. అదీగాక, స్టాలిన్ ఉన్నత సైనిక, ప్రభుత్వనాయకులనుశాస్త్రప్రవీణులనుచంపించడం వల్ల సోవియట్ యూనియన్‌పై దాడిచేయడానికి జర్మనీకి మరింత సులభమైంది.

## సోవియట్ సమాజాభివృద్ధి పట్ల సాధారణ దృక్పథం.

అక్టోబర్ విప్లవాన్ని తెచ్చినలక్షోపలక్షలమందికి, దానికి నాయకత్వం వహించిన లెనిన్‌కు, చరిత్రలోని మొట్టమొదటి సోషలిస్టు రాజ్యాన్ని సృష్టించి, పటిష్ఠం చేసిన మహనీయులందరికీ తరతరాల సోవియట్ ప్రజలు సమస్త మానవాళి రుణపడి ఉన్నారు.

విప్లవ రష్యా సోషలిజాన్ని ఎంచుకొని పూర్తిగా కొత్తదైన సమాజ నిర్మాణ పథం తొక్కింది. సోవియట్ రూప ప్రభుత్వం తన తొలి అడుగులు వేసేటప్పుడు సోషలిస్టు ఆశయాన్ని ఎలా అమలు జరపాలనే విషయమై బోల్షివిక్ పార్టీలో తీవ్రమైన చర్చలు జరిగాయి. యుద్ధకాలపు కమ్యూనిజం పరిస్థితుల్లో లెనిన్, బోల్షివిక్కులు ఆర్థికమేనేజిమెంటులో హుకుందారీ పరిపాలనా పద్ధతులను పరీక్షించి చూచారు. పరిశ్రమలపై ప్రభుత్వానికి సంపూర్ణమైన పట్టు ఉండటంతో ''కార్మికరాజ్య ఆదేశాల ద్వారా ఒక రైతాంగ దేశంలో కమ్యూనిస్టు ఉత్పత్తి పంపిణీ'' వ్యవస్థను సృష్టించడానికి ప్రయత్నం జరిగింది. లెనిన్ ఈ తప్పును కనిపెట్టి, తప్పు జరిగినట్లు అంగీకరించి నూతన ఆర్థిక పథకాన్ని (నెప్) రూపొందించారు. తద్వారా పని చేసే మేనేజిమెంటు పద్ధతికి మళ్ళారు. యిది రైతులనూ, కార్మికులనూ సమీకరించి విశాల ప్రజానీక సృజనాత్మక శక్తిని విడుదల చేస్తుంది. ప్రజల చొరవకు హామీకల్పిస్తుంది. శక్తిని బట్టి పని, పనిని బట్టి ప్రతిఫలం అనే సోషలిజం ప్రధాన సూత్రానికి గల నిరంకుశాధికారవర్గ అవరోధాలను తొలగిస్తుంది. లెనిన్ తన జీవితచరమకాలంలో ''మనరాజకీయ వ్యవస్థలోని మార్పుల పరంపరను'' విపులీకరించారు. ఈ వ్యవస్థ పెంపొందే కొద్దీ దాని రాజకీయ స్థిరత్వానికి గల హామీలను గురించి పేర్కొన్నారు.

సోషలిజం నిర్మాణం గురించిన లెనిన్ భావనలోని సారభూతాంశం శ్రామికునిపై, అతని ప్రయోజనాలూ, హక్కులపై దృష్టికేంద్రీకరించడం; ఈ నూతన వ్యవస్థ అతని కోసం విడుదలచేసిన సృజనాత్మక శక్తులను, దేశసంస్కరణకు ప్రధాన సాధనంగా వినియోగించడం; ప్రతిశ్రామికుని ఆర్థిక పరిస్థితి మెరుగుపడేలా తన శక్తి సామర్థ్యాలు అతడు పెంపొందించుకునేలా ఈ సంస్కరణను అమలు జరపడం. కాబట్టి కేంద్రస్థాయిలోను, స్థానికంగాను ప్రజాస్వామ్యం నెలకొనాలి, అని లెనిన్ అన్నారు. సాంకేతిక పద్ధతులు ఆధునికమైనవిగా ఉండాలి. ఖర్చుల మదింపు జరగాలి. శ్రామికుడు మేనేజిమెంటులో పాల్గొనాలి, హుకుందారీ వైఖరులకు విరుద్ధమైన ఆర్థికమేనేజిమెంటు వస్తతులు ఉండాలి ఇదీ లెనిన్ సూచించిన మార్గం.

పెట్టుబడిదారీ చక్రబంధం పరిస్థితుల్లో దేశ శాంతియుతాభివృద్ధికి అవకాశాలను సాధించుకొని సైద్ధాంతికంగా సుసంపన్నమైన కమ్యూనిస్టుపార్టీ విజయాలు సాధించగలదని ఆశించేందుకు ప్రాతిపదికలు ఉండినాయి. ఈసైద్ధాంతిక సంపద, లెనిన్ లక్ష్యసిద్ధికి మార్గం ఎంచుకొనే అవకాశం స్టాలిన్ నాయకత్వానగల పార్టీకి సంక్రమించింది. ఆయనేమో వ్యక్తిగత అధికారంకోసం అర్రులు చాచారు. అనేక సమస్యల పట్ల ఆయన భావాలు లెనినిస్టు భావాలు యేమాత్రంకావు.

స్టాలిన్ నిజంగా నిరంకుశుడు. పార్టీసభ్యులపైన, రాజ్యాంగ వ్యవస్థపైన సంపూర్ణాధికారం పొందిన స్టాలిన్ 1930 ల చివరకు తన లక్ష్యం సాధించారు. సోషలిజం గురించి, తనసొంత దృక్పథం వున్నందున ప్రధాన విషయాల్లోసోషలిస్టు సమాజం నిర్మాణమైందని చెప్పుకోవడానికి ఆయనకు సర్వాధారాలు ఉండినాయి. ఆనాటి పార్టీ పత్రాలన్నీ సోషలిజం గురించి నాడు చలామణీలో ఉన్నస్టాలినిస్టు దృక్కోణం నుంచీ సోవియట్ చరిత్ర పరిశీలనను ప్రతిబింబించాయి. యిది శాస్త్రీయదృక్కోణానికి మౌలికంగా భిన్నమైనది. నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టు ఆదర్శాలు కాక, బారకాసుల సోషలిజం లక్ష్యంగా గలది.

# సోవియట్ చరిత్ర గురించిన భిన్న దృక్పథాలు

సోవియట్ యూనియన చరిత్రను గురించిన శాస్త్రీయ అవగాహన కలగాలంటే మనం సోషలిజంపట్ల కొత్త సమకాలీన దృక్పథాన్ని నేడు ప్రాతిపదికగా చేసుకోవాలి. నిజమైన సోషలిజం ఏమిటో, మునుపేమి జరిగిందో, దానికీ, నిజమైన సోషలిజానికీ గల సంబంధం ఏమిటో వివరించాలి. యిది సులువైన పనికాదు. గత పరివర్తనల సంక్లిష్టత, దానిలోని పరస్పర వైరుధ్యాల మూలంగా గతం ద్వంద్వ స్వభావం కలిగినది.

వ్యవసాయ సమిష్టీకరణనే తీసుకోండి. సహజంగానే యిది సహకార రైతు వ్యవసాయ క్షేత్రాల గురించిన భావన నుంచీ ఉత్పన్నమైనది. మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రతిపాదించిన ఈ భావనను లెనిన్ అభివృద్ధిపర్చారు. లెనిన సహకార పథకం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకోసం ఉద్యమం క్రమక్రమంగా సాగాలని తలపెట్టింది. రైతులను అందుకు క్రమక్రమంగా సన్నద్ధం చేయాలని చెప్పింది. ఎలా సహకరించాలో, ఉత్పాదక శక్తుల పెరుగుదలను అరికట్టకుండానే కులక్కులను యెలా "పరిమితం" చేయాలో జనం ఆలోచించాలని లెనిన్ చెప్పారు.

కానీ, స్టాలిన్ ప్రధానమైన లెనినిస్టు సలహాలన్నిటినీ తిరగతోడారు. ఈ సమస్యలపై 15వ పార్టీ మహాసభ(1927 డిసెంబర్) 14వ పార్టీ సమావేశం (1925 ఎప్రిల్) నిర్ణయాలను ఉపేక్షించారు. రైతులపై విపరీతమైన వత్తిడి తెచ్చారు. సార్వత్రిక సమిష్టీకరణకు సరియైన సన్నాహాలు జరగలేదు. ఫలితంగా వేలాది రైతుకుటుంబాలను వారి సొంత భూములనుండీ తరిమివేసి, ఉత్పత్తి సాధనాలతో సహా వాటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది. కుటుంబ పెద్దలపై దమన చర్యలను తీసుకొన్నారు. యిదంతా సోషలిస్టు శాసనాలను ఉల్లంఘించడమే. యెందుకంటే "వ్యవసాయంలో వేతనశ్రమ నియామకాన్ని, స్వల్పకాలిక భూమికౌళ్లను పార్టీ 14వ సమావేశం నిర్దేశించింది 1927 లో కులక్కుల సంఖ్య 3.9 శాతం, 1929 లో 2.5-3 శాతం మాత్రమే కాగా 1929-30 శీతాకాలంలో కులక్కుల తొలగించే పేరుతో కొన్ని చోట్ల 10-15 శాతం రైతుకమతాలు జప్తుచేయబడ్డాయి. సమిష్టీకరణ కాలంలో వర్గపోరాటం యిలా కృతకంగా తీవ్రతరం చేయబడినందువల్ల లెనిన ఒకప్పుడు హెచ్చరించినట్లుగానే ఉత్పాదక శక్తుల పెరుగుదల ఆగిపోయింది. చాలాకాలంపాటు వ్యవసాయాభివృద్ధి వెనుకపట్టు పట్టింది. యిదంతా చెబుతున్నామంటే సోవియట్ సోషలిస్టు వ్యవసాయంలోని కష్టాలను తెలియజెప్పడానికే గాని, కష్టపడి సాధించిన సోషలిస్టు రూపాలను ఎద్దేవచేయడానికి కాదు. ఈ రూపాలు జయప్రదంగా పనిచేస్తున్నాయి. తగినంత సమకాలీన విషయ పుష్టిని సమకూర్చుకో గలుగుతున్నాయి. ఒక ప్రగతిశీల లక్ష్యాన్ని అభివృద్ధినిరోధక, పాశవిక పద్ధతుల ద్వారా సాధించడం జరిగింది. యిటువంటి ద్వంద్వ స్వభావం పారిశ్రామికీకరణలో కూడా కనిపించింది. రైతులను నష్టపెట్టి దేశ పారిశ్రామికీకరణకు పూనుకోవడంలో స్టాలిన్ ట్రాట్ స్కీ భావాలను అనుసరించారు. తన వ్యక్తిగత నియంతృత్వం నిర్మించిన రాజ్యనిరంకుశాధికారి బృంద అధికార సౌధం బలమైన పాదార్థిక, సాంకేతిక పునాదిపై ఆధారపడి ఉండేలా, తానుపాలించే దేశం సర్వావృతమైన "యావజ్జాతి స్వామ్యం" గల ఒక మహాబలమైన రాజ్యంగా ఉండేలా స్టాలిన్ చేయవలసిందంతా చేశారు.

పారిశ్రామిక ఉత్పత్తిపై సంపూర్ణమైన ప్రభుత్వ నియంత్రణ నెలకొన్నప్పుడు "యావజ్జాతి స్వామ్యం", సర్వాధికృతలో ఉన్న సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు నెలకొన్నట్లు ప్రచారం జరిగింది. కాని, ఉత్పత్తి సాధనాలను వాటి సొంతదారుల నుంచీ క్రూరంగా లాగివేసి వాటిని ప్రభుత్వానికి అప్పగించడం జరిగింది. దోపిడీదార్లను చంపివేశారు. పెట్టుబడిదారులు లేకపోవడమంటే అందరూ సోషలిస్టులే అని అర్థంకాదు. ఈ సంగతిని కొందరు గ్రహించలేక పోయారు. ప్రజలను తమ దేశానికి నిజమైన అధినాయకులుగా చేయడానికీ, జాతి ఆస్థిని వారే స్వయంగా నిర్వహించడానికీ, తదుపరి చర్యతీసుకోవలసి ఉండింది.

ఆనాటి పరివర్తనల ద్వంద్వ స్వభావాన్ని గుర్తించాలి. నాడు సాధించిన రాజకీయ, ఆర్థిక ఫలితాలను అప్పటి తప్పుల, వక్రీకరణల కారణంగా పూర్తిగా కొట్టివేయడం యెంత తప్పో వాటిసోషలిస్టు రూపాన్ని చూచి ఆనందించడం కూడా అంత తప్పు. మరింత సోషలిజం అనే నేటి నినాదం దీనికి సంబంధించినదే.

[నౌకా ఇ జిజాన్ (విజ్ఞానశాస్త్రమూ, జీవితమూ) పత్రిక సౌజన్యంతో]

# అలెక్సేయ్ రైకోవ్

## రాజకీయవేత్తగా వ్యక్తిగా.....

ఆర్. లీనెవ్



1922 లో మంత్రిమండలి సమావేశంలో తీసిన ఫొటోలో ఒక భాగం. వి.ఐ.లెనిన్, ఎ.రైకోవ్ (కుడి వైపు వున్నవారు)

అర్థశతాబ్దం క్రితం పదిమందిని మితవాద ట్రాట్స్కీ ముఠాగా పరిగణించి వారిని దోషులుగా ప్రకటించడం జరిగింది. యిప్పుడు సోవియట్ యూనియన్ ప్రాక్యురేటర్ జనరల్ అప్పీలు చేసినమీదట, వారిమీద నిందమోపినట్టుగా వారు ప్రభుత్వానికీ, దేశానికీ వ్యతిరేకంగా యెలాంటి నేరాలూ చేయలేదని సోవియట్ యూనియన్ సుప్రీంకోర్టు వారికేసును మళ్ళీ పరిశీలించి తీర్పు చెప్పింది. ఆనాడు నేరవిచారణ జరిపిన తీరు పూర్తిగా చట్టాన్ని వుల్లంఘించిందని యీ విచారణలో రుజువైంది. ఆనాటి ముద్దాయిల్లో అలెక్సేయ్ రైకోవ్ ఒకరు.

వ్లదీమిర్ లెనిన్ మరణానంతరం అలెక్సేయ్ రైకోవ్ 1924 నుంచీ 1930 వరకూ సోవియట్ ప్రభుత్వ అధిపతి హోదాలో పనిచేశారు.

"నేను యెప్పుడు యెక్కడ పుట్టానో నాకే తెలీదు" అనేవాడు రైకోవ్ తన మిత్రులతో పరిహాసంగా దానర్థం అధికారిక రిజిష్టర్‌లో నమోదైవున్నట్లుగా ఆయన పుట్టిన వూరు, తేదీ అసలైనవి కావు. రిజిష్టర్ ప్రకారం ఆయన సరాతవ్‌లో 1881 ఫిబ్రవరి 13 న పుట్టినట్టు తెలుస్తుంది. కానీ బహుశా అలెక్సేయ్‌రైకోవ్ వ్యాత్కా గుబేర్నియాలోని కుకార్క గ్రామంలో పుట్టారు; సరాతవ్‌కు తరలిరాకముందు ఆయన కుటుంబం అక్కడ వుండేది. ఆయన తండ్రి తన కుటుంబాన్ని తరలించే ముందు కుమారుని జననాన్ని రిజిస్టర్‌లో నమోదు చేయించక పోయి వుండొచ్చునని పిస్తుంది. అంత కుముందు రైతుగా, కుటుంబపెద్దగా వుండిన ఆయన సరాతవ్‌లో వ్యాపారి అయ్యాడు. అక్కడ ఆయన భార్య మరణించింది; తర్వాత ఆయన మరణించడంతో ఆయన ఆరుగురు పిల్లలు అనాధలయ్యారు. తిండి, చదువుకునే అవకాశం సంపాదిం:ంచుకోవడంకోసం ఆ అనాధలు ట్యూషన్లు చెప్పుకోవాల్సి వచ్చింది. బడిలో అలెక్సేయ్ వుత్తమ శ్రేణి విద్యార్థి; గణితశాస్త్రంలో, విజ్ఞానశాస్త్రంలో ఆయనకు మంచి ప్రతిభ వుండేది.

విప్లవ బృందాలతో సంబంధాలు పెట్టుకున్న అలెక్సేయ్ రైకోవ్ ప్రవర్తన అనుమానాస్పద

# అలెక్సేయ్ రైకోవ్

## రాజకీయవేత్తగా వ్యక్తిగా.....

మైందని పేర్కొన్నందు వల్ల ఆయన మాస్కో, లేదా సెయింట్ పీటర్స్ బుర్గ్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించేందుకు అవకాశంలేకపోయింది. ఆయన చాలాదగ్గర్లోవున్న కజాన్‌విశ్వవిద్యాలయంలోచేరారు. 1901 లో మొట్టమొదటి సారిగా అరెస్టయ్యారు. ఆయన్ను సరాతవ్‌కు ప్రవాసం పంపారు. అక్కడ జరుగుతున్న ఒక ప్రదర్శనలో పాల్గొన్న ఆయనను పోలీసులు చితకబాదారు.

1902 లో ఆయన మొదటిసారిగా లెనిన్‌ను జెనీవాలో కలుసుకున్నారు. కార్యనిర్వహణలో, ప్రజలను ఒప్పించడంలో ఆయనకున్న ప్రజ్ఞను లెనిన్ వెంటనే కనిపెట్టాడు. పార్టీ మహాసభకు సన్నాహాలు, రహస్యపోలీసులు అణచివేసిన మాస్కోకమిటీతో బాటు స్థానిక శాఖలపునరుద్ధరణతో సహా (యెడతెరిపిలేకుండా పార్టీని నిషేధించిన పట్టి పరిస్థితుల్లో) అత్యంత జటిలమైన కర్తవ్యాలను ఆయనకు అప్పజెప్పాడు. 1905, 1917 లో విప్లవఘటనలు వుధృతంగా వుండిన కాలంలో, అలెక్సేయ్‌రైకోవ్ మాస్కో కమిటీ నాయకత్వ అత్యున్నత స్థానంలో వుండడం తటస్థించింది మాస్కో కమిటీ ఆయన్ను పార్టీ 3 వ మహాసభ (లండన్) ప్రతినిధిగా పంపింది.

పార్టీలో మంచి పలుకుబడి, గొప్ప అనుభవంగల అలెక్సేయ్‌రైకోవ్ సోవియట్ ప్రథమప్రభుత్వంలోని కీలకమైన పదవిలో నియమితుడయ్యారు: ఆయన ఆంతరంగిక వ్యవహారాల పీపుల్స్ కమిసార్ (మంత్రి) అయ్యారు. నూతన పరిపాలనసంస్థలను వ్యవస్థీకరించడం ఆయన కర్తవ్యంగా వుండేది. కానీ, 1917 అక్టోబర్ విప్లవానంతరం తొలిరోజులనుంచీ కేంద్రకమిటీలోనీ, ప్రభుత్వంలోనీ ఒక ముఠా సోవియట్ ప్రభుత్వం మునుపటిలాగే వుండాలా లేక సోషలిస్టు పార్టీల ప్రతినిధులను అందులో చేర్చుకోవాలా (యిది రైల్వే కార్మికుల పెద్ద యూనియన్ అయిన విక్జెల్ చేసిన డిమాండ్) అనే విషయానికి సంబంధించి లెనిన్ పట్ల, ఆయన్ను సమర్థిస్తున్న మెజారిటీ వర్గం పట్ల భేదాభిప్రాయాలను పెంచుకొంది.

లెనిన్ ఆ డిమాండ్‌ను అసంబద్ధమైనదిగా భావించాడు; కానీ, ఆ డిమాండ్ అసంబద్ధమైనదనే విషయంతో యేకీభవించకపోగా యీ విషయంపై తమ అసమ్మతిని ప్రకటిస్తూ పీపుల్స్ కమిసార్లైన మిల్యూతిన్, నోగిన్, తియదోరవిచ్‌లతో కలిసి ప్రభుత్వపదవికి రాజీనామా యిచ్చారు రైకోవ్.

నూతన ప్రభుత్వంలో అలాంటి అసమ్మతి వ్యక్తమైనందుకు విప్లవశత్రువులు పరమానందపడ్డారు. కాగా లెనిన్‌తోసహా అనేకమంది, బోల్షెవిక్కులు ఆగ్రహం చెందారు. అప్పుడు రైకోవ్ వుద్దేశాలేమిటో అర్థంచేసుకోవడం యీనాటికి కష్టమే కాని ఒక విషయం మాత్రం స్పష్టం. ఆయనకు సందేహం కలిగిన యేపనినైనా ఆయన చేయకపోయేవాడు.

ఆ తర్వాత 1920 ల చివర్లో స్టాలిన్‌తో భేదాభిప్రాయాలు యేర్పడినప్పుడు కూడా రైకోవ్ అలాగే చేశారు: ప్రభుత్వాధిపతి హోదాకు ఆయన తన రాజీనామాను స్టాలిన్‌కు సమర్పించాడు. యిదే ఆయన పుట్టిమునగడానికి కారణమనిపిస్తుంది.

లెనిన్ నాయకత్వాన వ్యవహారాలు భిన్నంగా వుండేవి. లెనినే స్వయంగా చెప్పాడు: "రష్యాలో అక్టోబర్‌విప్లవం సంభవించనున్న తరుణంలో, అలాగే ఆ తర్వాత వెంటనే రష్యాలోని అనేకమంది మంచి కమ్యూనిస్టులు పొరబాటు చేశారు; ఆ విషయాన్ని గుర్తుతెచ్చుకోడానికి మన ప్రజలు యిప్పుడు యేవగించుకుంటున్నారు అది గుర్తుచేసుకోవడానికి వాళ్ళెందుకు ఏవగించుకుంటున్నారు? యెందుకంటే, పూర్తిగా సరిదిద్దిన తప్పులను ప్రత్యేకమైనకారణం లేకుండా గుర్తుచేసుకోవడం పొరపాటు."

కొన్ని చర్యలు తీసుకోవడంద్వారా ఆ పొరబాట్లను సరిదిద్దారు. రైకోవ్ మళ్ళీ మాస్కో ప్రాంత ఆహారసరఫరాల కమిసార్ పదవిని స్వీకరించారు. అంతర్యుద్ధం జోక్యం తీవ్రంగా సాగుతున్నప్పుడు సైన్య, నౌకాదళ సరఫరాల అసాధారణ రక్షణ మంత్రిత్వ శాఖకూ, లేబర్‌కౌన్సిల్‌కూ ఆయన అధిపతిగా వుండేవారు. ఆయన నిజంగా అద్భుతమైన కృషిచేశారు. యుద్ధం మూలంగా బాగా దెబ్బతిన్న దేశంలో లభించినవన్నీ ఎర్రసైన్యానికి ఆయన సరఫరాచేశారు. దేశంలోని ప్రధానమైన యుద్ధ పరిశ్రమలు మూలపడి పోయాయి. ఆయన వాటిని పునరుద్ధరించి, మళ్ళీ పనిలో పెట్టించగలిగారు. పరిస్థితీ, పనులూ అలా వుండేవి. ప్రభుత్వం నుంచీ రైకోవ్ రాజీనామా చేసిన విషయమే మరుగున పడిపోయింది. ఆర్థిక అస్తవ్యస్తతను యెదుర్కొని కృషిని వ్యవస్థీకరించేందుకు నాయకత్వం ఒకవ్యక్తిని యెంచుకోవాల్సిన అవసరం యేర్పడింది. ఆపనికి రైకోవ్‌ను యెంచుకున్నారు: ఆయన సర్వాధికార ఆర్థిక సమితికి అధ్యక్షుడుగా నియమితులయ్యారు.

నూతన ఆర్థిక విధానాన్ని (నేప్) ప్రవేశపెట్టడంతో ఆర్థిక మేనేజిమెంట్ పద్ధతులను నాటకీయంగా మార్చుకోవాల్సి వచ్చింది. ఆ దశను గురించి రైకోవ్ యిలా చెప్పారు: "యిప్పుడు మనం ఆజ్ఞల ద్వారా, గుత్తాధిపత్యం ద్వారా గాకుండా మరింత బాగా శ్రమించడం ద్వారా విజయం సాధించాలి "వాణిజ్య పరమైన మేనేజిమెంట్"కు (యిది ఆయనపెట్టిన పేరు), మారాల్సిన, వినిమయదారీ సరకుల, పారిశ్రామిక సరకుల వుత్పత్తిలో ఒకేరీతిగా నైపుణ్యం సాధించా

## అలెక్సేయ్ రైకోవ్

### రాజకీయవేత్తగా వ్యక్తిగా.....

ల్సిన, నగర, గ్రామీణ సరకుల మధ్య మార్పిడిని అత్యుత్తమంగా వినియోగించుకోవాల్సిన ఆవశ్యకతరాన్ని గురించి ఆయన నొక్కి చెప్పారు.

అది ఆర్థిక పునరుద్ధరణలో నూతన మరింత క్లిష్టమైన దశ. జాతీయంచేసిన పరిశ్రమలన్ను, ముఖ్యంగా యింధనం, యినుము, వుక్కు, రవాణా రంగ పరిశ్రమలను పునరుద్ధరణకృషికి కీలకమైనవిగా రైకోవ్ పరిగణించారు. పెట్టుబడులలో అధికభాగాన్ని యీ శాఖలకు పెట్టాలని ఆయన భావించారు.

అదే సమయంలో, పరిశ్రమలకన్నా వ్యవసాయాన్ని త్వరితంగా పునరుద్ధరించటానికి విలువ డుతుంది కాబట్టి "రైతాంగ ఆర్థిక ప్రాముఖ్యత కార్మికవర్గ ఆర్థిక పాత్రకన్నా చాలా యెక్కువగా వుంటుంది." అని ఆయన పేర్కొన్నారు. పెద్ద కర్మాగారాది సంస్థలకు ప్రభుత్వం ఆర్డర్లు పెట్టడం ద్వారా, వుత్పత్తి ఖర్చుకన్నా మించి చెల్లించడం ద్వారా, పునరుద్ధరణ ధరలను నిర్ణయించడం ద్వారా పరిశ్రమల పునరుద్ధరణను త్వరితం చేయవచ్చునని ఆయన భావించారు.

కానీ, యీ అనుకూల పరిస్థితిని అవకాశంగా తీసుకుని మేనేజిమెంట్ సంస్థలు తక్కువ ఖర్చులతో వుత్పత్తి చేయడానికి ప్రయత్నించలేదు; కాగా ధరలను పెంచాయి. **1923** ఆకురాలుకాలానికల్లా యీ కారణాలవల్ల వ్యవసాయోత్పత్తుల ధరలకూ, పారిశ్రామిక సరకుల ధరలకూ మధ్య అఖాతం యేర్పడింది. విపరీతమైన ధరలతో పారిశ్రామిక సరకులను అమ్మడం సాధ్యపడలేదు; వాటి నిల్వలు పెరిగాయి. ఫలితంగా ఆర్థిక సమస్యలు, ఆర్థిక కార్యకలాపాల్లో క్షీణస్థితి, నిరుద్యోగం తలెత్తాయి.

ఏకీకృత ఆహారపన్ను, ద్రవ్యం, వేతనాలు, జీతాల, ధరల సంబంధ కమిషన్ల తోసహా వివిధ కమిషన్లకు అలెక్సేయ్ రైకోవ్ యేకకాలంలో ఆధిపత్యం వహించారు చివరపేర్కొన్న కమిషన్ టోకుధరలను, చిల్లరధరలను తగ్గించగలిగింది.

పీపుల్స్ కమిసార్ల సమితి అధ్యక్షునికి డిప్యూటీగా, ఆ తర్వాత లెనిన్ మరణానంతరం అధ్యక్షునిగా అలెక్సేయ్ రైకోవ్ అపారమైన బరువు బాధ్యతలను మోశారు. గొప్ప సైద్ధాంతిక రచనలు చేయకపోయినప్పటికీ ఆయన వారసత్వం విలువైనది; యెందుకంటే, అది సామాజిక, ఆర్థిక సమస్యలను పరిష్కరించడమెలాగో ఆచరణాత్మక అనుభవాన్ని ప్రతిబింబిస్తుంది. అత్యంత గడ్డుకాలంలో ఆర్థిక ఆలోచనలను పార్టీవిధానం నిర్ణయిస్తుందని ఆయన అనుభవం రుజువు చేస్తోంది.

సోషలిస్టు సమాజనిర్మాణంలో సహకార సంఘాలు అత్యంత ముఖ్యమైన వని ఆయన అభిప్రాయం. పాత, యుద్ధపూర్వపు శక్తిసామర్థ్యాల, నూతన ఆర్థికవిధాన ఆధిక్యతల ప్రాతిపదికపై అభివృద్ధి చెందుతూ యీదేశం తన ఆర్థికవ్యవస్థను అతిస్వల్ప కాలంలో పునరుద్ధరించుకుందనీ, అయితే వున్నత అభివృద్ధి రేటును సాధించడానికి వీలుకల్పించిన వనరులను పూర్తిగా ఖర్చుపెట్టేసిందనీ ఆయన అభిప్రాయం. "యంత్రాలు, యెరువులు, వినిమయసరకులు, సమకూరిస్తే తప్ప ఫలప్రదంగా అభివృద్ధి చెందజాలని వ్యవసాయంతో సహా మొత్తం ఆర్థికవ్యవస్థ యెదుర్కొంటున్న సమస్యయిది. అందువల్ల మనం యిప్పుడు నిధుల పంపిణీ విషయంలో పరిశ్రమలకు అగ్రప్రాధాన్యమివ్వాలి; ఆ తర్వాత పరిశ్రమల ఖర్చు మీద వ్యవసాయరంగానికి తగినంత సహాయం అందించవచ్చు. పరిశ్రమల్లో కూడా మనం ఒక విషయాన్ని వుపేక్షించరాదు; తేలికరకం పరిశ్రమలకు సంబంధించిన నిధులలో కొంతభాగాన్ని యింజనీరింగ్ పరిశ్రమకు మళ్ళించే అవకాశమివ్వాలి" అని అన్నారాయన.

"తమజీవశక్తిని అనుభవంలో రుజువు చేసుకున్నట్టి సమిష్టి వుత్పత్తి రూపాలకు ప్రభుత్వాలు, సహకార సంఘాలు తోడ్పాటివ్వాలి. యీ రంగంలో మనం, యెలాంటి బలవంతంగానీ, గురికి దూరంగా వున్న నినాదాలు గానీ లేకుండా చూసుకోవాలి; వ్యవస్థీకరణలో నూతన పద్ధతికి గల సామర్థ్యాన్ని వ్యవసాయదారులు తమ సొంత అనుభవం ద్వారానే తెలుసుకునేట్టు చూడాలి" అని వ్యవసాయాన్ని గురించి మాట్లాడుతూ ఆయన యింకా యిలా అన్నారు.

"మనం కొయ్యనాగళ్ళను వుపయోగిస్తున్నంతవరకూ సోషలిస్టు వ్యవసాయాన్ని నెలకొల్పలేము. వ్యవసాయోత్పత్తిలో విప్లవం తీసుకురావడానికి ఒక ట్రాక్టర్ చేసినంత గొప్పదోహదం భూమిసమిష్టి వుపయోగ రూపాలకు గల సామాన్య ప్రయోజనాల గురించి చెప్పే వెయ్యిమంది ప్రచారవేత్తలుకూడా చేయలేరు."

లెనిన్‌కాలంలో ప్రారంభమైన నూతన ఆర్థిక విధానాన్ని కొనసాగించాలని అలెక్సేయ్ రైకోవ్ సమర్థించినట్లు యీ సూత్రీకరణలను బట్టి రుజువౌతోంది

**1927-1928** వరకూ యేకరీతిగా అనుసరించిన యీవిధానం ధాన్యసేకరణలో (దీన్ని "ధాన్యసంక్షోభం", "ధాన్యకార్యాచరణ" అనికూడా అంటారు) క్షీణదశకు చేరుకుంది.

కులక్కుల (పాలేర్లను పనికి పెట్టుకునే భూస్వాములు) ప్రతిఘటన పెరగడం యీ సంక్షోభానికి కారణమని స్టాలిన్ భావించాడు; ధాన్యాన్ని దాచిపెట్టినవారిపై "తక్షణచర్యలు" తీసుకోవడం ద్వారా

## అలెక్సేయ్ రైకోవ్

### రాజకీయవేత్తగా వ్యక్తిగా.....

యేకకాలంలో సమిష్టివ్యవసాయాన్ని త్వరితం చేయడం ద్వారా ఆ యిబ్బందులను తొలగించవచ్చునని ఆయన నిర్ణయించాడు. ఆ రెండు కార్యక్రమాలు యెంతగా మితిమీరి అమలు జరిగాయంటే, అది ప్రమాదకరమైన లక్షణమని మరో యిదరు పొలిట్ బ్యూరో సభ్యులైన, బుఖారిన్ తోమ్స్కీలతో సహా రైకోవ్ గ్రహించారు.

రైకోవ్ యిలా చెప్పారు: "వ్యవసాయదారులపై ఒక విధానంగా, వారితో ఘర్షణా ప్రమాదాలను పట్టించుకోకుండా దాదాపు నిర్విరామంగా తీసుకున్న తక్షణచర్యలు పూర్తిగా పొరపాటు చర్యలు, యివి దేశానికి ప్రమాదకరమైనవి"

ఈ ఘర్షణలో బలాన్ని ప్రయోగించే, వుద్రిక్తతలను రెచ్చగొట్టే ప్రభుత్వ విధానానికి వ్యతిరేకంగా నిరసన తెలుపుతూ రైకోవ్, బుఖారిన్, తోమ్స్కీలు రాజీనామాలు యిచ్చారు. జలగల్లాంటి కులక్కులకు అలెక్సేయ్‌రైకోవ్ రక్షణ కల్పిస్తున్నాడనీ, పారిశ్రామికీకరణ నెమ్మదిగా జరగాలని ప్రచారంచేస్తున్నాడనీ ఆయనపై నిందమోపారు. వాస్తవానికి రైకోవ్ ఆ కాలంలో విస్తృత వ్యాప్తిలో వున్న డిక్రీ ద్వారా మేనేజిమెంట్‌ను యెదుర్కొంటూ, సమతూక ఆర్థిక మేనేజిమెంట్‌ను సమర్థించారు. రైకోవ్‌కూ, స్టాలినిస్టులకూ మధ్య యేర్పడిన భేదాభిప్రాయానికి నిజమైన ప్రధానకారణంయిదే. విరుద్ధశక్తుల ఐక్యత విషయం మరిచిపోయి, గతితర్కాన్ని కేవలం విరుద్ధశక్తుల పోరాటంగా మాత్రమే పరిగణించాడు స్టాలిన్. అధికారమంటే వ్యతిరేకశక్తులన్నిటినీ నిర్మూలించడమేనని ఆయన భావించాడు.

*　　*　　*

అలెక్సేయ్ రైకోవ్ కుమార్తె అయిన నతాల్యా రైకోవ్‌ను నేను యిటీవలే కలుసుకున్నాను. ఆమె ఫ్రిఅబ్రజెంకలో నిరాడంబరమైన ఒక చిన్న గదిగల వాటాలో వుంటున్నారు. మొట్టమొదట నా దృష్టిని ఆకర్షించింది ఒక ఫోటో. అందులో లెనిన్, రైకోవ్‌లు వున్నారు. ఆమెతండ్రి యెలాంటి వ్యక్తి అని నేనామెను అడిగాను.

ఆమె యిలా చెప్పారు: "ఆయన బక్కపల్చగా, పొడుగ్గావుండేవారు. ఆయన జుత్తు నల్లగా, ముఖం వెడల్పుగా, కళ్ళు చెప్పలేనంత నీలంగా వుండేవి. ఆయన గడ్డంలో, మీసాల్లో విచిత్రంగా రకరకాల ఛాయలు కనిపించేవి. ఆయన మా అమ్మను మొదటిసారి కలుసుకున్నప్పుడు చాలా తమాషాగా ఒక ఘటన జరిగింది. ఆమెకూడా బోల్షివిక్ పార్టీలో ప్రముఖవ్యక్తి. ఆమె నాకు ఆ సంగతంతా యిలా చెప్పింది: 'పారిస్‌లో లెనిన్ వుంటున్నవాటాలో యిదంతా జరిగింది. నదేజ్దా క్రూప్‌స్కయా బయటికి వెళ్ళారు. ప్యాత్‌నీత్‌స్కితో లెనిన్ చదరంగం ఆడుతున్నారు. డోర్‌బెల్ మోగింది. వెళ్లి తలుపు తీసింది నేనే. చాలా అనుమానాస్పదమైన గడ్డం మీసాలతో ఒకవ్యక్తి నాకు కనిపించాడు. అతను సంకేత పదం చెప్పినప్పటికీ అతను గూఢచారి అని నాకు అనుమానం కలిగింది. నేను లెనిన్‌దగ్గరికి పరుగెత్తుకుంటూ వెళ్ళి విషయమంతా చెప్పాను. చదరంగం ఆటలో వుత్సాహంగా నిమగ్నమైవున్న లెనిన్ ఆ గూఢచారిని చూడ్డానికి వెళ్ళారు. ఆ గూఢచారి యెవరో ఆయనకు తెలిసిపోవడంతో బిగ్గరగా నవ్వాడు.

ఆయన యెప్పుడూ హుషారుగా వుండేవారు; బాగా నవ్విస్తూండేవారు. ప్రకృతంటే ఆయనకు మహాయిష్టం.'' అని నతాల్య రైకోవ చెప్పారు.

ఆమె తండ్రి రోజూ పనిచేసే తీరు గురించి నేనామెను అడిగాను. ఆమె యిలా చెప్పారు: "మేము క్రెమ్లిన్‌లో నివసిస్తున్నప్పుడు మధ్యాహ్నం భోజనానికి ఆయన యింటి కొచ్చేవారు. భోజనం తర్వాత సోఫామీద విశ్రాంతి తీసుకుంటూ '7 నిముషాల్లో పీపుల్స్ కమిసార్ల కౌన్సిల్ సమావేశం మొదలౌతుంది. 5 నిముషాలు కాగానే నన్ను లేపడం మర్చిపోకండి' అనే వారు. సాధారణంగా ఆయన రాత్రి 11 గం॥ల దాకా పనిచేసేవారు. యింటికొచ్చిన తర్వాత టీతాగి చదువుకునేవారు. కొంచెం ముందుగా యింటికి రాగలిగితే ఆయన మా అమ్మనూ, నన్నూ నాటకానికి తీసుకెళ్ళేవారు''.

ఆయన స్నేహితుల గురించి ఆమెను అడిగాను. "ఆయనకు ప్రత్యేకించి సన్నిహితులైన మిత్రులున్నట్టు నాకు గుర్తులేదు. ఆయన మామూలుగా అందరితోనూ స్నేహంగా వుండేవారు.''

టెలిఫోన్‌కాల్ రావడంతో మా సంభాషణకు అంతరాయం కలిగింది. యెవరో అలెక్సేయ్ రైకోవ్‌కు శ్రద్ధాంజలి ఘటించాలను కుంటున్నారట. ప్రజలు ఆయన్ను యిప్పటికీ మర్చిపోలేదు. ఒక మనిషి జీవితకాలంకన్నా అతడు చేసిన సత్కార్యాలు యెక్కువకాలం జ్ఞాపకముంటాయి.

చారిత్రక అనుభవాన్ని యేమాత్రం పరిగణన లోనికి తీసుకోకుండా గతాన్ని విశ్లేషించి, భవిష్యత్తును అంచనా వేయడానికి ప్రయత్నించడం అనూహ్యం కాన్నీ,యీ అనుభవం వల్ల ప్రజలకు ఒనగూడేదేమీలేదని, వారు చరిత్రనుండి నేర్చుకోడానికి, దానిగుణపాఠాలను మార్గదర్శకంగా పెట్టుకోడానికి విముఖంగా వున్నారని పలుకుబడిగలవారు చేసిన ప్రకటనలు గుర్తొన్నాయి. వారి దృక్కోణం నుండి చూస్తే యిది. సరియైనదిగానే కనిపించవచ్చు గతానికి సంబంధించిన యెన్నో ముఖ్యమైన గుణపాఠాలు వృధా అయ్యాయి.అయితే యీనాటి సమస్యల పరిష్కారానికి గతాన్ని పరిశీలించడం ప్రజలుమానివేయలేదు చేసిన తప్పులనే తిరిగి చేయదలచుకోనివారు గతంనుండి గుణపాఠాలను తీసుకుంటారు.

యాభైయేళ్ల క్రితంకుదిరిన మ్యూనిచ్ ఒప్పందం యిలాంటి గుణపాఠం తీసుకోదగిన ఘటనల్లో ఒకటి. **1938** సెప్టెంబరు **9**న మ్యూనిచ్‌లో బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ నాయకులు ఛాంబర్లేన్, ఎడ్వార్డ్ డలాడైర్, హిటర్ల్, ముసోలినీలు ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. సుడెటెన్ ప్రాంతాన్ని జర్మనీ ఆక్రమించుకోడానికి అనుమతించిన ఒప్పందమిది. దురాక్రమణదారున్ని బుజ్జగించే విధానానికి యిది పరాకాష్ఠ.

నాజీప్రభుత్వం, దాని బంధుదేశాల వల్ల సంభవించనున్న యుద్ధ ప్రమాదం సామ్రాజ్యవాదదేశాల పాలక వర్గాలకు తెలుసు కాని వారికి సోషలిజంపై, దానికి పట్టుగొమ్మగా వున్న సోవియట్ యూనియన్ పై గల పచ్చివిద్వేషం నాజీ జర్మనీని "నాస్తికులైన బోల్షెవిక్కుల" పైకి ఉసిగొల్పడానికి పురిగొల్పింది.

ఎం. పొనమరేవ్

# మ్యూనిచ్ గుణపాఠాలు



## మ్యూనిచ్ గుణపాఠాలు

తమ లక్ష్యాన్ని సాధించుకోడానికి నాజీ దురాక్రమ దారునిక రాయితిలిచ్చే విధానాన్ని వారు చేపట్టారు. సోషలిస్టురాజ్యానికి వ్యతిరేకంగా మతయుద్ధాన్ని నిర్వహించగల సమర్థత హిట్లర్‌కు వుందని వారు భావించారు.

ఈ విధంగా అమెరికా, పశ్చిమ యూరప్‌దేశాలు జర్మనీని తిరిగి సైనికీకరించడానికి హిట్లర్‌ను ప్రోత్సహించాయి. సమిష్టి భద్రతా వ్యవస్థ సృష్టి ద్వారా యుద్ధాన్ని నివారించడానికి సోవియట్ యూనియన్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. అంతే కాదు చెకొస్లొవాకియాను జర్మనీకి దత్తం చేసే ఒప్పందాన్ని 1937 లోనే బ్రిటన్ ఫ్రాన్స్‌లు ఆమోదించాయి. తద్వారా చెకొస్లొవాకియాతో తనకు గల పరస్పర సహాయసంధిని ఫ్రాన్స్ ఖాతరు చేయలేదు. ఏడాది తర్వాత కుదిరిన మ్యూనిచ్ ఒప్పందంలో యీ నమ్మక ద్రోహాన్ని నమోదు చేయడం జరిగింది.

మ్యూనిచ్ ఒప్పందం ప్రకారం చెకొస్లొవాకియా పశ్చిమ భాగమైన సుడెటెన్ లాండ్‌ను, యింకా కొన్ని ప్రాంతాలను జర్మనీ ఆక్రమించింది. అదే సమయంలో మరికొన్ని ప్రాంతాలను బూర్జువా పోలెండ్‌కు, హార్డీపాలనలో గల హంగరీకి దత్తం చేయడం జరిగింది. దీని ఫలితంగా చెకొస్లొవాకియా తన భూభాగంలో సుమారు 20 శాతం, జనాభాలో 25 శాతం, భారీ పరిశ్రమలశక్తి స్తోమతల్లో 50 శాతం కోల్పోయింది. యీ విధంగా చెకొస్లొవాకియా ప్రజలను వెన్నుపోటుపొడిచారు. యీ ఒప్పందంలో భాగస్వాములైన దేశాల మానవ విద్వేషం యెంత తీవ్రమైనదంటే, కనీసం యీ ఒప్పందం గురించి మరునటి రోజు వరకూ చెకొస్లొవాకియాకు తెలువ లేదు.

"మన తరానికి శాంతిని తెచ్చాను" అని లండన్ చేరుకున్న తర్వాత చాంబర్లేన్ గొప్పగా ప్రకటించాడు. అనంతరం సంవత్సరం తిరగక ముందే నాజీ జర్మనీ పోలెండ్ పైదాడిచేసి ప్రపంచాన్ని రెండవ ప్రపంచయుద్ధ జ్వాలల్లో ముంచివేసింది.

ఈ యుద్ధంలో 50 మిలియన్లకు పైగా ప్రజలు మరణించారు. దేశాలకు దేశాలే సర్వనాశనమయ్యాయి. హిట్లర్, ప్రజలను బానిసలుగా చేసుకునే ప్రమాదం నిజంగా యెదురైంది.

తూర్పుదిశగా హిట్లర్ సాగేట్టు బుజ్జగిస్తూ పాశ్చాత్య దేశాలు చేసిన ప్రయత్నాలు వికటించాయి. యిది చేదు సత్యం. మొదట హిట్లరు పాశ్చాత్య దేశాల పైనే దాడిచేసి, వాటిని చావుదెబ్బతీసి తర్వాతనే సోవియట్ యూనియన్‌పై దృష్టిని కేంద్రీకరించాడు. జర్మనీ సైన్యాల నడ్డిని విరగ్గొట్టింది రష్యన్ ప్రతిఘటనే. యీ విధంగా సోవియట్ యూనియన్ నిర్ణయాత్మకమైన పాత్రనిర్వహించింది.

వాస్తవాలివి. మరో విషయం. సిగ్గుచేటైన మ్యూనిచ్ ఒప్పందం చట్టవిరుద్ధమని సోవియట్ యూనియన్ ప్రకటించింది. మ్యూనిచ్ ఒప్పందం అది కుదిరినప్పటి నుండే చెల్లుబడిలో లేకుండా పోయింది అని 1973 లో కుదుర్చుకున్న సంధిలో చెకొస్లొవాకియా, పశ్చిమ జర్మనీలు ధ్రువీకరించాయి.

యాభైయేళ్లక్రితం మ్యూనిచ్‌లో జరిగిన నమ్మక ద్రోహం గుణపాఠాలు యీ నాటికీ ముఖ్యమైనవే. సోవియట్ వ్యతిరేక జాడ్యం ప్రమాదాలను, శాంతిని వల్లిస్తూనే ఆ ముసుగులో అంతర్జాతీయ సమస్యను సైనిక బలంతో పరిష్కరించే వైఖరిలోని ప్రమాదాలను మరిచిపోకూడదు.

మ్యూనిచ్ ఒప్పందం నుంచి నేర్చుకోవాల్సిన మరో గుణపాఠముంది. రాజ్యాల, లేదా రాజ్యాల బృందాల మధ్యగల సైద్ధాంతిక విభేదాలకన్నా యుద్ధాన్ని ప్రత్యేకించి ఎవరికీ విజయం లభించని అణుయుద్ధాన్ని నివారించడం యెంతో ముఖ్యం. యిది తిరుగులేని సత్యం. సోవియట్ యూనియన్ పైగల సైద్ధాంతిక విద్వేషాన్ని పాశ్చాత్య దేశాలు గనుక అదుపులో పెట్టుకుని వుండి వుంటే రెండవ ప్రపంచయుద్ధం జరిగేదికాదు.

# సోవియట్ ముస్లింల పరిపూర్ణ జీవితం



న్యూటైమ్స్ విలేకరికి ట్రాన్స్‌కకేసియా ముస్లింబోర్డు ఛైర్మన్ షేక్-ఇస్లాం అల్లా షుకుర్ పాషా-జాదే ఇంటర్వ్యూ.

సోవియట్ ముస్లింల మత కార్య కలాపాల గురించిన స్పష్టమైన అవగాహన విదేశాల్లోని పాఠకులకు లేదు.

తమ తోటి సోవియట్ పౌరుల లాగానే సోవియట్ యూనియన్ లోని ఇస్లాం మతస్థులు వుంటున్నారు. ఇక వారి మత కార్యకలాపాలను నాలుగు స్వతంత్ర ముస్లింబోర్డులు నిర్వహిస్తున్నాయి. అవి తాష్కెంట్, ఉఫా, మఖాచకాలా, బాకూలలో వున్నాయి. మసీదుల పరిరక్షణ, ఇస్లాంమతస్థులు షరియాను కచ్చితంగా పాటించేట్టు చూడడం; కాజీలకు శిక్షణ నివ్వడం; మత సాహిత్యాన్ని ప్రచురించడం - యివి వీటి ముఖ్య విధులు. ఇస్లాం పవిత్ర ప్రదేశాలకు యాత్రలను కూడా యివి నిర్వహిస్తాయి.

**మన దేశంలో ముస్లింలు తమ మత కార్య కలాపాలను నిర్వహించుకోలేక పోతున్నారని పాశ్చాత్య దేశాల్లో వినికిడి...**

ఇది నిజంకాదు. సోవియట్ యూనియన్‌లోని ముస్లింలు గౌరవ ప్రదమైన జీవితం గడుపుతున్నారు. తమమతాన్ని పాటించే అవకాశాలు వారికి వున్నాయి. సోవియట్ రాజ్యాంగ చట్టం ప్రకారం యితర పౌరుల కున్న హక్కులు మాకు వున్నాయి. ఇస్లాం మతస్థులు పరిపూర్ణ జీవితం గడుపు తున్నారని చెప్పడానికి ఎన్ని వుదాహరణలనైనా యివ్వ వచ్చు.

సోవియట్ ముస్లింల జీవితానికి సంబంధించి కాకమ్మ కథలను వ్యాపింపజేస్తున్న వారికి అసలు పరిస్థితి బాగా తెలుసు. సోవియట్ సమాజంలోని యితర పౌరులకూ ముస్లింలకూ మధ్య విభేదాలు

సృష్టించడానికి వారు చేస్తున్న ప్రయత్నాలు విఫలం కాకతప్పవు. అవి రెచ్చగొట్టేచర్యలని ముస్లింలు భావిస్తున్నారు. భిన్నమతాల, విశ్వాసాల, భిన్నజాతుల ప్రజల సోదరత్వమే మా సమాజానికి యెంతో బలాన్నిస్తోంది. అది మాకు తెలుసు. ఆ సోదరత్వానికి మేము యెంతో విలువనిస్తున్నాం.

**సౌదీ అరేబియా హజ్ యాత్రలు సోవియట్ ముస్లింలకు నిషిద్ధం అని చెపుతున్నారు. నిజమేనా?**

ఇది నిజంకాదు. 1987 వేసవిలో నాతోపాటు సోవియట్ యూనియన్‌కు చెందిన వివిధ ప్రాంతాల ముస్లింలు యీ యాత్రలో పాల్గొన్నారు. అంతకుముందు సంవత్సరం యీ యాత్రలో పాల్గొన్న వేలాదిమంది కూడా తమ యాత్రకు ఎవరైనా ఆటంకాలు సృష్టించినట్టు ఫిర్యాదు చేయలేదు.

అయితే నేనొక విషయం చెప్పకతప్పదు. గతహజ్ సందర్భంగా పవిత్రమక్కా వీధుల్లో ముస్లింలు ఆయుధాలతో తలపడ్డవిచారకర దృశ్యాన్ని చూచాం. అది మమ్మల్ని కుదిపివేసింది. ఇస్లాం మతస్థులందరికీ పవిత్ర స్థలమైన ఆ ప్రదేశంలో అంత్య క్రియల ప్రార్థనలు వినవలసి వచ్చింది. మా ఇస్లాం ప్రపంచంలో యేదో లోపమున్నట్లు కనిపిస్తున్నది. ముస్లింలు కలిసికట్టుగా యీ విషయాన్ని పరిశీలించాలి

**రక్తంచిందింది మక్కాలోనే కాదు. ప్రపంచంలోని ముస్లిం మండలాల్లో యీనాడు భగ్గుమనే పరిస్థితి వుంది.....**

అవును, ఇది దురదృష్టకరం. ఇరాన్, ఇరాక్‌ల మధ్య జరుగుతున్న భాతృహత్యా యుద్ధం ఒక ఉదాహరణ

**ఇస్లాం ఏకాకితనాన్ని పాటించడం యిటీవల పెరిగిందని పాశ్చాత్య దేశాల్లో అంటున్నారు. యీ ఆరోపణలో నిజముందా?**

వారి అభిప్రాయంతో నేను ఏకీభవించను. యితరులకు ముస్లింలు దూరంగా వుండే ప్రమాదాల గురించి ప్రగతిశీల ఇస్లామిక్ నాయకులు హెచ్చరించారు. ఇతర మతస్థుల తోనే కాక, విభిన్న లౌకిక వర్గాలలో కూడా విస్తృతంగా సంబంధాలు పెట్టుకోవాలని సంభాషణలు జరపాలని వారు చెపుతున్నారు. ముస్లింశాంతి వుద్యమాన్ని తక్కువ చేసిచూపే ప్రయత్నంలో దాని ప్రత్యర్థులు నిందలు కురిపిస్తున్నారు. శాంతికోసం పోరాటంలో ముస్లింలు అనే శాశ్వత సంస్థ ఏకాకిత్వానికి నిదర్శనమని వారు చెపుతున్నారు. అసలు ఇది సంయుక్త కార్యాచరణకు వుద్దేశించిన సంస్థ భూమ్మీద శాంతి కోసం సోవియట్ ముస్లింలు చురుకుగా పనిచేస్తున్నారు.

**బాకూలోని అజ్దార్‌బెక్ మసీదులో ప్రార్థనలు**



## సోస చర్చా వేదిక

# సాంస్కృతిక విలువల గురించి

సాంప్రదాయిక, చౌకబారు సంస్కృతుల మధ్య పరస్పర సంబంధం

విరుద్ధ సంస్కృతిపైనే దురాక్రమణ

రాక్ కళ యెవరికి ప్రయోజనకరం?

సంస్కృతి, నైతిక సూత్రాలు

ఈవిషయాలను గురించి సామాజిక శాస్త్రవేత్త క్సేనియా మ్యాలో, తత్వవేత్త యూరి దవీదవ్, విమర్శకుడు సుర్కోవ్‌లు చర్చజరిపారు.

చౌకబారు సంస్కృతి,
జానపద సంస్కృతి.

మ్యాలో: చౌకబారు సంస్కృతి, జానపద సంస్కృతి-యివి రెండూ ఒకటేనా అని మన పాఠకులు తెలుసుకోవాలనుకుంటున్నారు. యీ ప్రశ్నకు జవాబు చెప్పాలంటే మనం వీటి మూలాధారాలను పరిశీలించాల్సి వుంటుంది.

చౌకబారు సంస్కృతి ప్రజలే స్వయంగా అభివృద్ధిచేసిందికాదు యిది ప్రజాబాహుళ్యంకోసం సృష్టించినది. అంతేగాక, దీనికి ముఖ్యంగా వాణిజ్యపరమైన నిర్దిష్ట లక్ష్యాలున్నాయి.

కానీ, జానపద, చౌకబారు సంస్కృతుల మధ్య మరింత గాఢమైన, తీవ్రమైన తేడాలున్నాయి. అత్యంత మౌలికమైన తేడా యేమంటే, ప్రజల ప్రధానకార్య కలాపాలన్నిటికీ సహజవ్యక్తీకరణ అయినందువల్ల జానపదసంస్కృతి - యిది గొప్ప వూహాశక్తికీ, వుల్లాసకరమైన జానపదనృత్యాలకు, దుఃఖాలకు, ఛలోక్తులకు తదితరాలకు పరివ్యాప్తమైంది - సర్వదా పూర్వముఖంగా సాగుతుంది. కాగా ''ఉదాసీనత', యెంతటికైనా తెగించి సంతోషపెట్టడం చౌకబారు సంస్కృతికున్న ప్రధానలక్షణం. ఫలితంగా ఆత్మి

కళాభ్యున్నతి పొందగల సామర్థ్యాన్నే హతమార్చే ప్రమాదాన్ని సృష్టిస్తోంది.

**దవీదవ్:** చౌకబారు సంస్కృతికన్నా సాంప్రదాయిక జానపద సంస్కృతికీ, సంప్రదాయబద్ధ సంస్కృతికీ మధ్య సారూప్యత చాలా యెక్కువగా వుంది. "శిష్టమైనది", కొంతమందికి మాత్రమే అర్థమయ్యేదీ కాబట్టి వున్నతశ్రేణి సంస్కృతిగా కొందరు ప్రవీణులు జమకడ్తున్నట్టి అవాన్‌గార్డ్, ఆధునిక సంస్కృతి యీ శతాబ్దాంతానికి వున్నత సంస్కృతీ (యీ మాటకున్న సిసలైన అర్థంలో) శ్రేణిలో చేరేబదులు, చౌకబారు సంస్కృతీశ్రేణిలో చేరగలిగిన అనేక లక్షణాలను వెల్లడించిందని మనం తప్పనిసరిగా ఒప్పుకోవాల్సి వుంది. మరింత మెరుగులు దిద్దుకోడానికి ప్రయత్నిస్తూ, నిజమైన సంస్కృతితో యిది జరుపుతున్న పోరాటాన్ని బట్టి. యీ బాంధవ్యం అత్యంత స్పష్టంగా కనిపిస్తోంది.

# సాంస్కృతిక విలువల గురించి

**బాహ్ స్వరకల్పన చేసిన మాస్‌తో దీటురాగల అర్హతలు ప్రజాదరణ పొందిన ఒక పాటకున్నాయా?**

**మ్యాలో:** అసాధ్యమైన లక్ష్యమైనప్పటికీ అంతిమ లక్ష్యంగా "మరింత వున్నత ప్రమాణం", "ఆదర్శం" అనే భావనను తోసిపుచ్చే ధోరణి యిటీవలికాలంలో పెరుగుతున్నట్టు కనిపిస్తోంది. కాలక్షేప, వినోదకళ వుండకూడదని నా వుద్దేశం కాదు. కానీ, ప్రజారంజకమైనపాట, బాహ్ స్వరకల్పనచేసిన మాస్ - యీ రెండింటినీ పూర్తిగా ఒకేగాటకట్టడమంటే, సంస్కృతిపునాదులనే తలకిందులు చేయడమని అర్థం

రాక్ సంగీతానికి తన సొంత స్థానముంది. మొత్తం మీద కొత్తది. రాక్ ఒకరకంగా మనస్తత్వశాస్త్రపరంగా సామాన్యమైన 'చౌచౌ' నాటకరంగంకన్నా 20 వ శతాబ్దపు కళాత్మక అవాన్‌గార్డ్ తాలూకు తాత్వికతకు, సౌందర్యరసజ్ఞతకు మరింత సన్నిహితంగా వుంది. రాక్ తరచుగా మనిషి మనస్సులోని వ్యాకులతపై, ప్రమాదకరమైన వక్రప్రవృత్తులపై ప్రభావం నెరపుతుంది; అది ఒకరకమైన ఆదిమరూపంలోని శక్తిని విడుదల చేస్తుంది. యీ శక్తిని బహుశా అణుపేలుడు శక్తితో మాత్రమే పోల్చవచ్చు. కానీ, యిలా విడుదలైన శక్తిని యేంచేయాలో తోచని స్థితిలో రాక్ వున్నట్టు అనిపిస్తుంది.

**దవీదవ్:** మనం 20 వ శతాబ్దపు కళా సంస్కృతిని పరిశీలిస్తే, అది ఒకవైపు జానపద, వృత్తిపరమైనదిగా, మరోవైపు సంప్రదాయంతో తెగదెంపులు చేసుకుని దానికి విరుద్ధమైనదిగా మారుతున్న అవాన్‌గార్డిస్టు- ఆధునిక, చౌకబారు కళగా విభజితమై వున్నట్టు కనిపిస్తుంది.

రాక్ ¯కళ పైనపేర్కొన్న వాటిలో చివరి ధోరణికి చెందుతుందనడంలో సందేహంలేదు. సాంప్రదాయిక, "శాస్త్రీయ" లేదా సార్వత్రిక సాంస్కృతిక విలువలను పునరంచనావేసే ధోరణిని అది విపరీత స్థాయికి తీసుకెళ్తోంది. మరింత వున్నత ఆత్మిక, నైతికవిలువలకోసం సంస్కృతి జరిపే కృషికి చురుగ్గా, దురాక్రమణపూరితంగా వ్యక్తమౌతున్న వ్యతిరేకతే చౌకబారు సంస్కృతి రాక్‌ను తనలో యిముడ్చుకోడానికి వీలుకల్పిస్తోంది.

**మ్యాలో:** మరోమాట. రాక్ అభిమానులు తమ వున్మత్తతతో, తాము అర్థం చేసుకునే శక్తి లేకపోవడంతో బాహ్‌ను, బిథోవెన్‌ను అప్రతిష్టపాల్జేయడానికి తీవ్రప్రయత్నం చేస్తున్నారు; యీ వూబిలోకి పుష్కిన్‌ను, దస్తయేవ్‌స్కీని,యితర గొప్పరచయితలను కూడా లాగుతున్నారు. యిది యీ స్థాయికి దిగజారిపోయినప్పుడు - "వున్నత", "సంకీర్ణ" భావనలను తిరస్కరించడమేగాక బ లవంతాన బయటికి నెట్టినప్పుడు, ధనపిశాచి ముందుకొచ్చినప్పుడు - రాక్ నిజంగా వ్యతిరేక సంస్కృతిగా మారుతుంది. యిది సంస్కృతి సర్వదా నెరవేర్చాల్సివున్న లక్ష్యాలను, మానవునిలో ఆత్మికసంపద అనే ధాన్యాన్ని మొలకెత్తించి పెంచాల్సివున్న లక్ష్యాన్ని త్యజిస్తుంది. నిజానికి, "కుల్తూర" అనె పదానికి భూమిని సాగుచేయడమని అర్థం.

**సుర్కోవ్:** మనది విషాదభరితమైన, వెర్రెత్తించే ధ్వని నానాటికీ పెరుగుతున్న యుగమని వర్థమాన తరంవారు భావిస్తున్నారు. ధ్వనినే సర్వోత్కృష్టకళల విలువల్లోకి చొప్పించడం ద్వారా వారు ధ్వని మీద పైచేయి సాధించేందుకు ప్రయత్నిస్తున్నారు. యీ పరిణామక్రమంలో వాస్తవానికి జరిగేదేమిటి? ప్రత్యామ్నాయాన్ని యెంచుకోవడనా? నవరించడమా?

సవరించడమేనని నేను భావిస్తున్నాను.

సర్వోత్కృష్టకళలను కేవలం వున్నతస్థాయికి తీసుకెళ్ళే నమూనాలుగా భావించడంద్వారా గతకాలపు కళతో సజీవ సంబంధం పెట్టుకునేందుకున్న అవకాశాన్ని మనం చేతులారా జారవిడుచుకోవడమే అవుతుంది. గతకాలపు కళను పరిరక్షించుకోవడమనేది గతకాలపు విలువలతో సంబంధం పెట్టుకునేందుకు అత్యుత్తమమైన పద్ధతికాదు. సాంస్కృతిక విజయాలను, వున్నత సంప్రదాయాలను సృజనాత్మకంగా విలీనం చేసుకోవడం ద్వారా, నిరంతరం పునరుద్ధరించడం ద్వారా మాత్రమే సిసలైన సంబంధాన్ని యేర్పరచుకోవడం సాధ్యం.

**మ్యాలో**: సిద్ధాంతపరంగా కృశింపజేయడమనేది సంస్కృతికి తీవ్రమైన వ్యాధిలాంటిది; ప్రస్తుతం వుధృతమౌతున్న వుపసంస్కృతి అనేక విధాలుగా దీనికి వ్యతిరేక ప్రతిస్పందనే. కృశింపజేసే యీ పరిస్థితిని అధిగమించేందుకు జరిగే ప్రయత్నరూపంలో సాగుతున్న "విచ్చలవిడి" దొమ్మి సంస్కృతి పైన జెప్పిన దానంతటి విధ్వంసకరమైనది. యిటీవలి కాలంలో కూడా యిందుకు తగినన్ని వుదాహరణలు మనకు కనిపిస్తాయి. సిసలైన సంస్కృతి రెండు అగాధపుటంచుల మధ్య తాటి మీద నడుస్తున్నట్టు కనిపిస్తుంది; యిది యేక్షణంలోనైనా అగాధంలోకి కూలిపోయే అవకాశముంది. మనిషికీ, ప్రపంచానికీగల విధ్వంసక, ఆదిమశక్తులను గురించి దీనికి తెలుసు.

### సంస్కృతి సమగ్రత సమస్య

**దవీదవ్**: ఆధునిక సంస్కృతిలోని ఒక ప్రత్యేకమైన ధోరణి దృష్ట్యా మనం చర్చిస్తున్న సమస్యలన్నీ ప్రత్యేకమైన తీవ్రతను సంతరించుకుంటున్నాయి. చూడ్డానికి, యీ ధోరణి సానుకూలమైనదిగా కూడా కనిపించవచ్చు. కానీ జాగ్రత్తగా పరిశీలిస్తే, యిందులో ప్రమాదకరమైన అంశాలున్నట్టు వెల్లడౌతుంది. అంటే, సంస్కృతిని "కలగూరగంపగా చేయడం" విపరీతంగా పెరుగుతున్న "వుపసంస్కృతులు" కుక్కగొడుగుల్లాగా తలెత్తడం అని నా అభిప్రాయం. యీ పరిణామక్రమం సమాజంలో పెరుగుతున్న తారతమ్యాన్ని ప్రతిబింబిస్తోందికాబట్టి, నూతన, సాపేక్షంగా వేర్వేరుగా వుంచిన రంగాలను గురించి విడమర్చి చెప్తోంది కాబట్టి యిది పూర్తిగా సాధారణమైనదని సామాజిక శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. వీటిని సమర్థించేవారు యేదో ఒక్క సామాజిక, లేదా వృత్తిపరమైన బృందపు ప్రయోజనాలకు అనుగుణమైన విలువలను తప్ప మరే యితర విలువలనూ దృష్టిలో పెట్టుకోవాలనుకోరు.

ఒక ప్రత్యేక బృందపు విలువలకోసం సార్వజనీన సాంస్కృతిక, మానవతా విలువలను తిరస్కరించే యేరూపాన్నైనా సమర్థించడంలోనే అత్యంత తీవ్రమైన ప్రమాదముంది. నైతిక పరిపూర్ణత అనే ఆదర్శం వైపు సంస్కృతి పూర్వ్వముఖంగా సాగేందుకు సర్వదా హామీ కల్పించే సంస్కృతీ పునాదిని ధ్వంసంచేసేది యిదే. సార్వజనీన మానవ, సాంస్కృతిక విలువలనుంచీ "స్వేచ్ఛ" పొందిన ఆశ్రయాన్ని సృష్టించాలనే ప్రయత్నం విడిగావున్న ప్రతి ఒక్క సామాజిక, వృత్తిపర బృంద పరిధిలో తలెత్తుతుంది. సాధారణంగా, వృత్తిపరమైన వివిధ నైతికసూత్రాల — "శాస్త్రవేత్తల నైతిక సూత్రాలు,", "కళా కారుల నైతిక సూత్రాలు", "రాజకీయవేత్తల నైతికసూత్రాలు", వగైరా — ప్రస్తావనల ద్వారా యీ "స్వేచ్ఛ" ను సమర్థించడం జరుగుతుంది.

# సాంస్కృతిక విలువల గురించి

అంతిమఫలితమేమిటి? చివరకు, సాంస్కృతిక నైతిక స్థితిపై ప్రమాదకరమైన ప్రభావం నెరపగల నైతిక ఉదాసీనత వైపు; పౌర ఉదాసీనతవైపు మొగ్గుచూపే నానారకాల "వుపసంస్కృతులు" అవతరిస్తాయి. అఖండమైన సంస్కృతికి చెందినవారమనే భావన మందగించి, అందరికీ వుపయోగపడాలనే భావం అంతరించి తనకు వుపయోగపడితే చాలుననే సూత్రం - ముందు సొంతమేలు చూసుకుని, ఆ తర్వాతే "తక్కినవారి" మేలు చూడాలనే సూత్రం - దానిస్థానాన్ని ఆక్రమిస్తుంది.

ఈనాడు, నైతిక వున్ముఖతగల విలువలను పునరుద్ధరించాలనే భావం మాత్రమే సాంస్కృతిక సమగ్రతను పరిరక్షించగలదు. యిది కీలకమైన కర్తవ్యం. ఆత్మహత్యా సదృశమైన అణుయుద్ధ ప్రమాదాన్ని జీవ్యావరణ సంక్షోభాన్ని చెర్నోబిల్ హెచ్చరికను యెదుర్కొంటున్నమనకు యిదితప్ప మరో ప్రత్యామ్నాయంలేదు.

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశ తీర్మానాలు

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19వ అఖిల యూనియన్ సమావేశం ముగిసిన తర్వాత సోవియట్ కమ్యూనిస్టు పార్టీకేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం జరిగింది. ఈప్లీనరీ సమావేశం మూడు ముఖ్యమైన తీర్మానాలను .ఆమోదించింది. ఈతీర్మానాల సంక్షిప్తపాఠం దిగువనిస్తున్నాం.

## పార్టీ 19వ సమావేశ నిర్ణయాలను అమలు జరపడంపై తీర్మానం

1. పార్టీ జీవితంలోనూ, దేశజీవితంలోనూ ముఖ్య ఘటన అయిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19వ అఖిల యూనియన్ సమావేశం చేసిన నిర్ణయాల అమలు పెరిస్త్రోయికా, మౌలిక ఆర్థిక సంస్కరణ క్రమాలనూ, సోవియట్ సమాజంలో మరింత ప్రజాస్వామ్యంకోసంసాగే ఉద్యమాన్నీ గణనీయంగా త్వరితం చేయగలదన్న విషయాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ గమనించింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నివేదిక పైనా, అఖిల యూనియన్ సమావేశ యితర పత్రాలపైనా, నిర్మొహమోటంగా సూత్రబద్ధమైన చర్చ జరిగింది. ఈచర్చలో ప్రతినిధులు అత్యంత క్రియాశీలంగా పాల్గొన్నారు. చర్చలో ప్రజల శ్రేయస్సు పట్లా, సోషలిజం భవితవ్యంపట్లా గొప్ప శ్రద్ధాసక్తులు తొణికిసలాడాయి. సమిష్టి శ్రామిక బృందాల కార్యకలాపాలు, ప్రజలకు సరఫరాలను మెరుగు పర్చడం, శ్రామిక ప్రజలకు చేసే సేవల సమస్తరంగాల అభివృద్ధిని మరింత త్వరిత మొనర్చడం — వీటికి సంబంధించిన తక్షణ సమస్యల గురించి ఈచర్చలో యెన్నో వ్యాఖ్యలు, ఆచరణాత్మక సూచనలు చేశారు.

అఖిల యూనియన్ సమావేశ మార్గదర్శక సూత్రాల ఆచరణాత్మక అమలు పార్టీ పనిలోను, సమస్త ప్రభుత్వ సంస్థల, సమస్త పౌరసంస్థల పనిలోను రూఢిగా అతి ముఖ్య భాగమయ్యేలా చూడటం పార్టీ సంస్థల విధి అని సోవియట్

కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నిర్దేశించింది. కమ్యూనిస్టుల చొరవ, మంచి వ్యవస్థీకరణ; తలెత్తే సమస్యల నిర్మాణాత్మక పరిష్కారంలోను, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాల్లో నూతన వైఖరులను సుస్థాపితంచేయటంలోను, లోపాలను బ్యూరాక్రటిజం వ్యక్తీకరణలను, క్రమశిక్షణా, బాధ్యతారాహిత్యాలను తిప్పి కొట్టడంలోను ప్రతి సభ్యుని క్రియాశీల వైఖరి — వీటికి నిర్ణయాత్మక ప్రాముఖ్యం ఉంది.

2. దేశంలో ఆహార సరఫరాలను మెరుగుపర్చే చర్యలపైనా, వ్యవసాయ - పారిశ్రామిక సముదాయంలోని ఆర్థిక సంబంధాలను యితోధికంగా అభివృద్ధి పర్చి, నిర్దుష్టం చేయడానికి సంబంధించిన మార్గదర్శక సూత్రాలపైనా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్ బ్యూరో చేసిన ప్రతిపాదనలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఆమోదిస్తోంది.

—సోవియట్ యూనియన్ మంత్రిమండలి, యూనియన్ రిపబ్లిక్కుల, స్వయం పాలిత రిపబ్లిక్కుల మంత్రి మండలులు, ప్రాదేశిక, మండల ప్రజాప్రతినిధుల సోవియట్ల కార్యవర్గాలు, యూనియన్ రిపబ్లిక్కుల పార్టీల కేంద్ర కమిటీలు, ప్రాదేశిక, మండల పార్టీ కమిటీలు ఈ ప్రతిపాదనల ప్రాతిపదికపై దేశంలో ఆహార సరఫరాలను మెరుగుపర్చడానికి చర్యలను రూపొందించి, అమలు జరపడం అవసరమని కేంద్రకమిటీ భావిస్తోంది;

—19వ అఖిల యూనియన్ సమావేశం సిఫార్సులకు అనుగుణంగా మౌలిక ఆర్థిక సంస్కరణను అభివృద్ధి పర్చి, ప్రగాఢమొనర్చడానికీ, దాన్ని అమలు పర్చే క్రమంలో బయటపడే లోపాలను నిర్మూలించడానికీ తీసుకోవలసిన చర్యలకు సంబంధించిన ప్రతిపాదనలను సోవియట్ యూనియన్ మంత్రిమండలి రూపొందించిందని కేంద్ర కమిటీ గమనించింది . ఈమౌలిక సంస్కరణను అమలు పరచడానికి సంబంధించిన తదుపరి కృషికి, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో ఆమోదం పొందిన ప్రతిపాదనలను ప్రాతిపదికగా చేయాలి;

—వినిమయ సరకుల ఉత్పత్తిని పెంచడానికి, ప్రజలకు చేసే వ్యాపార సేవలను మెరుగు పర్చడానికీ, డబ్బు చెల్లించే ప్రాతిపదికపై అందించే సేవలరంగాన్ని మౌలికంగా పునర్వ్యవస్థీకరించడానికీ సంబంధించి, 19వ అఖిల యూనియన్ పార్టీ సమావేశందృష్టికి వచ్చిన సమస్యలపై సోవియట్ యూనియన్ మంత్రిమండలి ప్రతిపాదించిన సోవియట్ యూనియన్ ప్రభుత్వ ముసాయిదా నిర్ణయాలను పార్టీ కేంద్రకమిటీ ఆమోదిస్తోంది.

3. పార్టీకమిటీ విధులను ప్రజాప్రతినిధుల సోవియట్ల విధులను వేరుపర్చడానికై 19వ అఖిల యూనియన్ సమావేశం చేసిన నిర్ణయాను దృష్టిలో ఉంచుకుని యూనియన్ రిపబ్లిక్కుల తాలూకు పార్టీల కేంద్రకమిటీలూ, ప్రాదేశిక, మండల, ప్రాంతీయ, నగర, జిల్లా పార్టీ కమిటీలూ, సంబంధిత సోవియట్ సంస్థల్లో పని చేస్తున్న కమ్యూనిస్టులూ సాధ్యమైనంత త్వరలో ఆచరణాత్మక చర్యలను తీసుకోవాలి. ప్ర దేశాల సామాజిక - ఆర్థికాభివృద్ధి విషయంలో, సోవియట్ల స్వాతంత్ర్యాన్ని పెంచుతూ, విధుల నిర్వహణలో వాటి ఇతోధిక బాధ్యతకు హామీ ఇవ్వాలి; పాతవారి స్థానంలో కొత్తవారిని చేర్చుకోవడంలో, స్థానిక వ్యవహారాల పనిని వ్యవస్థీకరించడంలో, పార్టీ విధానాన్నీ ప్రభుత్వ విధానాన్నీ అమలు జరపడంలో సోవియట్లకు సహాయం చేయాలి;

— పార్టీయంత్రాంగ పునర్వ్యవస్థీకరణ జరగాల్సిన ప్రధానదిశలకు సంబంధించిన నిర్ణయాన్నీ ఈసంవత్సరాంతానికల్లా ఈ పనిపూర్తి కావాలన్న నిర్ణయాన్నీ కేంద్రకమిటీ ఆమోదిస్తోంది.

4. పార్టీసంస్థల పనిలో వాటి క్రియాశీలతను పెంచడానికీ, వాటి స్వేచ్ఛను పటిష్టం చేయడానికీ గల ప్రాధాన్యతను గమనించి కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం, యిక అదనపు ఆదేశాలు లేకుండానే పార్టీ సంబంధాలను ప్రజాస్వామ్యీకరించే విషయంలో సోవియట్‌కమ్యూనిస్టు పార్టీ అఖిల యూనియన్ సమావేశం నిర్దేశించిన కర్తవ్యాలను పార్టీసంస్థలు అమలు జరపడం అవసరమని భావిస్తోంది. పార్టీ సభ్యుల్లో గల ఉదాసీనతను అధిగమించడం పట్ల ప్రత్యేకశ్రద్ధ వహించాలి. పార్టీ త్వరలో ప్రారంభించ నున్న నివేదికల సమర్పణ ఎన్నికల ప్రచారానికి సూత్రరీత్యాగల ప్రాము

ఖ్యాన్ని పార్టీప్లీనరీ సమావేశం గమనించింది. ప్రజల అగ్రగామిదళంగా పార్టీ పాత్రనుపెంచడం; సామాజిక జీవిత సమస్తరంగాల్లో మౌలిక పరివర్త నలను తీసుకురావడానికీ, దేశ సామాజిక - ఆర్థి కాభివృద్ధిని త్వరితం చేయడానికీ కమ్యూనిస్టులను సమీకరించడం లక్ష్యంగా వుంచుకొని ఈప్రచారం ముందుకు సాగుతుంది. పార్టీ అఖిలయూనియన్ సమావేశ స్ఫూర్తి, దాని ప్రజాస్వామ్య వాతావరణం, విమర్శనాత్మక ధోరణి స్థానికపార్టీ సంస్థలకు విస్త రించాలి; ప్రతిపార్టీసంస్థ ఆచరణాత్మక కార్యకలాపా లతో పెరిస్త్రోయికా భావాల సమ్మేళనకు, పార్టీ జీవిత పునర్నవీకరణకు, పార్టీ నాయకత్వ ప్రజా తంత్రీకరణకు హామీ కల్పించాలి యిది ముఖ్యం.''

5. రాజకీయ వ్యవస్థ సంస్కరణకోసం, శాసన పరమైన, సంస్థాగతమైన చర్యలను తీసుకు నేందుకు కింది కర్తవ్యాలు నెరవేర్చడం అవసరం:

సోవియట్‌యూనియన్ రాజ్యాంగానికి సవరణలూ, చేర్పులపై శాసన ముసాయిదాను, సోవియట్‌యూనియన్ ప్రజాప్రతినిధుల ఎన్నికపై శాసనముసాయిదాను తయారుచేసి 1988 అక్టో బర్‌లో దేశవ్యాప్త చర్చలకు నివేదించాలి; 1989 మార్చిలో ఈ ఎన్నికలు జరిపించాలి; 1989 డిసెంబర్‌లో రిపబ్లిక్, స్థానిక రాజ్యాధికార నూతన సంస్థలు తమ విధులను చేపట్టేలా యూనియన్, స్వయంపాలిత రిపబ్లిక్కులలో ఏకకాలంలో తత్సంబంధమైన కృషి జరగాలి. సోవియట్ యూనియన్ రాజ్యాంగానికి సవరణలపైనా, ఎన్ని కలపైనా ముసాయిదా శాసనాలను తయారుచేయ డానికి పార్టీ 19 వ సమావేశానికి కేంద్రకమిటీ సమర్పించిన నివేదికలోను, ఆసమావేశం ఆమోదించిన తీర్మానాలలోనూ, ప్రస్తుత ప్లీనరీ సమావేశానికి కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సమర్పించిన నివేదికలోనూ గల నిబంధనలను ఆధారంగా చేసుకోవాలి;

—రాజ్యాధికార, న్యాయనిర్ణయసంస్థల నిర్మాణ స్వరూపాన్ని, కార్యకలాపాలను 19 వ అఖిల యూనియన్ పార్టీ సమావేశ నిర్ణయాలననుస రించి నిర్దుష్టం చేసే అంశాన్ని సోవియట్‌కమ్యూ నిస్టుపార్టీ కేంద్రకమిటీ తరపున, వచ్చే సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ సమావేశ పరిశీ లనకు నివేదించాలి. రాజకీయవ్యవస్థ సంస్కరణ ను అమలు జరపడానికీ, ప్రస్తుతం అమల్లో ఉన్న ఎన్నికల వ్యవస్థను పునర్నవీకరించడానికీ, న్యాయ స్థానాల కార్యకలాపాలను పునర్వ్యవస్థీకరించడానికీ సంబంధించి ముసాయిదా చట్టాలనూ, సోవియట్ యూనియన్ రాజ్యాంగానికి సవరణలను చేయడా నికి సంబంధించిన ప్రతిపాదనలనూ ఈ సుప్రీంసోవియట్ సమావేశంలో చర్చకు పెట్టాలి;

—సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్‌ను ఎన్నుకునేందుకు, అఖిల యూనియన్ రాజ్యా సంస్థల స్థాపనకు సంబంధించి దాని అధికార పరిధిలో వున్న యితర సమస్యలను పరిష్క రించేందుకు సోవియట్ యూనియన్ ప్రజాప్రతి నిధుల మహాసభను 1989 ఏప్రిల్ లో సమావేశ పర్చాలి. ఆ తర్వాత, యువ జనులపైనా, ట్రేడ్ యూనియన్ల హక్కులపైనా, స్వచ్ఛంద సంస్థల పైనా, పౌరకార్యనిర్వాహక సంస్థలపైనా, యితర పౌర సంఘాలపైనా, పత్రికలపైనా ముసాయిదా చట్టాలను, రాజకీయ వ్యవస్థ సంస్కరణ మూలంగా చేయవలసిన యితర చట్టాల ముసాయి దాలను గురించి సోవియట్ యూని యన్ సుప్రీం సోవియట్‌లో పని ప్రారంభం కావాలి;

—సోవియట్ల పాత్రను పెంచాలి; వాటి శాసన పర, పాదార్థిక-ద్రవ్య ప్రాతిపదికను మౌలికంగా పటిష్టం చేయాలి; స్థానిక స్వయంపాలనపై, స్థానిక ఆర్థిక వ్యవస్థపై ఒక ముసాయిదా చట్టాన్ని 1989 లో తయారు చేయాలి; దానికి స్వయంవ్యవహార నిర్వహణ,నిధుల స్వయం సేకరణ, స్వయం సమృద్ధి సూత్రాలను, ప్రాంతీయ ప్రయోజనాలను మొత్తం రాజ్య ప్రయోజనాలతో అనుసంధించాలన్న సూత్రాన్ని ప్రాతిపదికగా చేయాలి;

—స్థాయీ కమిటీల డిప్యూటీల, డిప్యూటీ బృందాల పాత్ర పెరిగే లాగా అన్ని స్థాయిలలోను సోవియట్ల కార్యకలాపాలలో మరింత ప్రజాస్వామ్యం నెలకొనేలా వ్యవహారాలను నడిపించాలి; పరిపాలనా సంస్థలపై అజమాయిషీ పెంచడం,నిరంకుశాధికార తత్వాన్ని తిప్పికొట్టడం, గ్లాస్‌నోస్త్‌ను పెంపొందిం చడం — వీటిగురించిన 19 వ పార్టీ సమావేశ మార్గ దర్శక సూత్రాలనుసంపూర్ణంగాఅమలుపర్చాలి

6. జాతుల మధ్య సంబంధాల రంగంలో, కొన్ని మండలాల అభివృద్ధిలోని స్తబ్దతా పరిణామాలను, జాతుల, ఉపజాతుల సామాజిక- ఆర్థిక, సాంస్కృతిక అవసరాలను గురించిన తక్కువ అంచనాను తొలగించడంపై దృష్టి కేంద్రీకరించాలి. సంకుచిత జాతీయ వాద, ప్రాంతీయ దురహంకారపూరిత ఆవేశ కావేషాలను. రెచ్చగొట్టే పెరెస్ట్రోయికా వ్యతిరేక శక్తులను దృఢదీక్షతో ఎదుర్కోవడం, జాతులమధ్య సంబంధాల చట్టబద్ధ ప్రాతిపదికను పటిష్టం చేయ డానికి 19 వ పార్టీ సమావేశం నిర్దేశించిన విధంగా చర్యలు తీసుకోవడం అవసరం;

సోవియట్ యూనియన్‌లోని జాతుల మధ్య సంబంధాలను నిర్దుష్టం చేసే సమస్యకు సంబంధించిన పత్రాలను యూనియన్ రిపబ్లి క్కుల కమ్యూనిస్టుపార్టీల కేంద్ర కమిటీలతోను సబంధి త ప్రాదేశిక, మండలపార్టీ కమిటీలతోను, పరిశోధనా సంస్థలతోను కలిసి 1989 ప్రారంభం నాటికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశ పరిశీలన కోసం తయారు చేయ వలసిందిగా కేంద్ర కమిటీ పొలిట్ బ్యూరోను ఆదే శించడమైనది.

7 న్యాయాధికార వ్యవస్థ సంస్కరణను, ప్రొక్యూరేటర్ కార్యాలయాల, మధ్యవర్తిత్వ నిర్ణయ వ్యవస్థ, దర్యాప్తు అధికారుల, న్యాయవాదుల సంఘాల, ఆర్థికరంగంలో న్యాయసలహా దారుల కార్యకలాపాలలో పునర్వ్యవస్థీ కరణను 1989 మధ్యకాలానికి ముందే పూర్తి చేయాలి, క్రిమినల్ చట్టాన్ని నిర్దుష్టం చేయడానికి పాటుపడాలి పెద్ద ఎత్తున న్యాయ వ్యవస్థ సంస్కరణను అమలు జరిపే దిశలో ఈ చర్యలను తొలి అడుగులుగా పరిగణించాలి.

## నివేదికల సమర్పణ - ఎన్నికలపై తీర్మానం

1. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనల కూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19 వ అఖిల యూనియన్ సమావేశ నిర్ణయాలకూ అనుగు ణంగా నివేదికల సమర్పణ-ఎన్నికల సభలు. సమావేశాలు, ఈ సంవత్సరం ముగిసేలోగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రాథమిక, జిల్లా, నగర, ప్రాంత, మండల, ప్రాదేశిక సంస్థల్లో జరుగుతాయి. త్వరలో జరగనున్న నివేదికల సమర్పణ-ఎన్నికల ప్రచారం పెరెస్ట్రోయికాను గాఢతరం చేయడానికి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19 వ అఖిలయూ .నియన్ సమావేశం రూపొందించిన నూతన మార్గదర్శక సూత్రాలను అమలు జరపడంలో ఒక ముఖ్య దశ కావాలని' కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం భావిస్తోంది. పార్టీ సామాన్య సభ్యుల కార్య శీలతకూ, పార్టీ సంస్థల కమిటీల పాత్ర, బాధ్యతల పెరుగుదలకూ, వాటిలో రాజకీయ నాయకత్వ పద్ధతుల సుస్థాపనకూ ఈ ప్రచారం అన్ని విధాలా దోహదం చేయవలసివుంది.

2. నివేదికల సమర్పణ-ఎన్నికల ప్రచారానికి జాగ్రత్తగా సన్నాహాలు చేయడం, ఉన్నతమైన సై ద్ధాంతిక, రాజకీయ, వ్యవస్థాత్మక స్థాయిలోనూ, ప్రజల రాజకీయ అగ్రదళంగా పార్టీపాత్రను పెంచే విధంగానూ దాన్ని నిర్వహించడం యూనియన్ రిపబ్లిక్కుల కేంద్రకమిటీల, ప్రాదేశిక, మండల ప్రాంత, నగర, జిల్లా పార్టీ కమిటీల, ప్రాథమిక పార్టీ సంస్థల విద్యుక్త ధర్మంకావాలి.

పార్టీ 27 వ మహాసభ నిర్ణయాలను అమలు పర్చడంలో సాధించిన ప్రగతిని లోతుగా, సమగ్రంగా విశ్లేషించడం, 19 వ అఖిల యూని యన్ పార్టీ సమావేశం నిర్దేశించిన కర్తవ్యాల అమలుకు సంబంధించిన ఆచరణాత్మక కార్య కలాపాలపై కమ్యూనిస్టులు తమ కృషిని కేంద్రీక రించడం - యివి నివేదికల సమర్పణ - ఎన్నికల సభలూ, సమావేశాలలో తప్పనిసరిగా జరిగాలి.

ఆర్థిక సంస్కరణలో ప్రగతీ, నూతన ఆర్థిక యంత్రాంగాన్ని ప్రవేశ పెట్టడం, ఉత్పత్తిరంగంలో ఖర్చుల మదింపు, నిధుల స్వయం సేకరణ సూత్రాల స్థాపన, సోషలిస్టు స్వయంపాలన అభివృద్ధి - ఈ సమస్యలన్నీ లోతుగా, సమగ్రంగా చర్చించాలి.

కాంట్రాక్టు, లీజు, సహకార వివిధరూపాలను అభివృద్ధి పర్చేప్రాతిపదికపై సమిష్టి, ప్రభుత్వ, వ్యవసాయ క్షేత్రాల ఉత్పాదనావ కాశాలను ఫలప్ర దంగా వినియోగించుకోవడానికి చర్యలను రూపొందించాలి. కింది ఇతర అత్యవసర కర్తవ్యా లను చర్చించడంలో వ్యవహార సరళివైఖరిని అవలంభించడంకూడా ముఖ్యం· బాగా నాణ్యమైన వినియోగ దారీ సరకులను మార్కెట్టుకు సరఫరా చేయడం; గృహనిర్మాణ స్థాయిని పెంచడం; పౌర, సాంస్కృతిక భవన నిర్మాణాన్ని హెచ్చించడం;

వర్తకం, సమస్త సేవారంగాలను, ఆరోగ్య రక్షణను మెరుగుపర్చడం. సెకండరీ, ఉన్నత విద్యా సంస్కరణను అమలు పర్చడం; శ్రామిక ప్రజల ఆత్మిక, సాంస్కృతిక అవసరాలను మరింత పూర్తిగా తీర్చడం.

సోవియట్ ప్రజలకు ప్రత్యేకించి యువజనులకు భావజాల, అంతర్జాతీయతా స్ఫూర్తి అలవడేలా వారిని ప్రబుద్ధం చేయడానికి సంబంధించిన సమస్యలు కూడా అతి ముఖ్యమైనవి.

3. పార్టీ ఆంతరంగిక జీవితాన్ని మరింత ప్రజాస్వామికం చేయడానికి, పార్టీ సంస్థల్లో సృజనాత్మక చర్చల వాతావరణాన్ని అభిప్రాయ స్వేచ్ఛను, విస్తృతమైన విమర్శ, ఆత్మ విమర్శలను, కమ్యూనిస్టుల యితోధిక స్వేచ్ఛ, వ్యక్తి గత బాధ్యత, చైతన్యయుత క్రమశిక్షణలను పెంపొందించడానికి, నివేదికల సమర్పణ - ఎన్నికల ప్రచారం అత్యంత దోహదం చేయవలసి ఉంది.

పార్టీ కమిటీల సభ్యులను, కార్యదర్శులను ఎన్నుకొనే సమయంలో అభ్యర్థులను గురించిన విస్తృత చర్చ, రహస్య ఓటింగు పద్ధతి సర్వత్రా ఉండటం అవసరం; ఎన్నిక కావలసిన స్థానాల కన్నా ఎక్కువ మంది అభ్యర్థుల పేర్లను బ్యాలట్ పత్రాలలో చేర్చడానికి సంపూర్ణావకాశం ఉండాలి; పై సంస్థకు అభ్యర్థులను ప్రతిపాదించేందుకు కింది పార్టీసంస్థలకు గల హక్కును అమలు జరపాలి; అయితే, తుది నిర్ణయం తత్సంబంధిత సమావేశ ప్రతినిధులదే అనే అవగాహనతో ఈ హక్కును అమలు జరపాలి.

ఒక వ్యక్తి ఎన్నికద్వారా పార్టీకమిటీల్లోని ఒకే స్థానంలో ఐదేళ్లచొప్పున రెండు పదవీ కాలాలపాటు వుండవచ్చునని పరిమితి విధిస్తూ 19 వ అఖిల యూనియన్ పార్టీ సమావేశం చేసిన నిర్ణయాన్ని వచ్చే నివేదికల సమర్పణ-ఎన్నికల ప్రచారం నాటినుండీ అమలు జరపడం అవసరమని ఈ ప్లీనరీ సమావేశం అభిప్రాయపడుతోంది. అదేసమయంలో ప్రతినాయకుని గురించిన సమస్యను ఆయన వ్యక్తిగత అర్హతల దృష్ట్యా చర్చించి, నిర్ణయించే హక్కు కమ్యూనిస్టులకు ఉంటుంది. ఆయన తన స్థానంలో ఎన్నాళ్ళున్నాడు అనే దానితో నిమిత్తం లేకుండానూ, తనకు అప్పగించిన బాధ్యతలను ఏవిధంగా అతను నిర్వర్తించాడు, తన పనిలో గుణాత్మక మెరుగుదలను సాధించ గలడా అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ సమస్యను నిర్ణయించవలసి ఉంటుంది.

4. పార్టీ సంస్థలలో నివేదికల సమర్పణ ఎన్నికలు విస్తృతమైన బాహాటత ఉన్న పరిస్థితిలో జరగాలి. సభలూ, సమావేశాలు సాగుతున్న క్రమం, వాటి వాతావరణం, కమ్యూనిస్టులు లేవనెత్తిన సమస్యలు- వీటిని గురించిన వార్తలను కేంద్ర, స్థానిక పత్రికలు, టెలివిజన్, రేడియో క్రమపద్ధతిలో తెలియజేయాలి; ఆమోదించిన నిర్ణయాలను గురించి, ఎన్నికైన పార్టీ కమిటీల సభ్యుల పొందిక గురించి విపులమైన సమాచారాన్ని ప్రజలకు అందజేయాలి; విమర్శనాత్మక వ్యాఖ్యలను ప్రతిపాదనలను ఎలా అమలు జరుపుతున్నది చూపాలి.

5. నివేదికల సమర్పణ-ఎన్నికల సభలను పార్టీ ప్రాథమిక సంస్థల్లో ప్రస్తుత సంవత్సరం సెప్టెంబర్-అక్టోబర్‌లో, జిల్లా, నగర, ప్రాంత పార్టీ సంస్థల సభలను అక్టోబర్-నవంబర్‌లో, మండల, ప్రాదేశిక పార్టీ సంస్థల సమావేశాలను నవంబర్-డిసెంబర్‌లోను జరపాలని స్థానిక పార్టీ కమిటీలు చేసిన ప్రతిపాదనలను ఆమోదించాలి.

6. ఈ ప్లీనరీ సమావేశంలో జరిగిన చర్చలను దృష్టిలో పెట్టుకుని, నాయక పార్టీ సంస్థలకు ఎన్నికలు జరపటంపై నిర్దేశనను ఆమోదించవలసిందిగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్ బ్యూరోను ఆదేశించడమైనది.

## పార్టీ యంత్రాంగ పునర్వ్యవస్థీకరణపై తీర్మానం

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం యిలా తీర్మానిస్తోంది:

1. ప్రస్తుత సంవత్సరం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ యంత్రాంగాన్ని స్థానిక పార్టీ సంస్థల యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించాలి. ఈ నాటి పరిస్థితులలో పార్టీ విధుల కనుగుణంగా ఈ యంత్రాంగ నిర్మాణ స్వరూపాన్ని పునర్వ్యవస్థీకరించాలి. యీ యంత్రాంగ సిబ్బంది మొత్తం సంఖ్యను గణనీయంగా తగ్గించాలి.

ప్రభుత్వ, ఆర్థిక, పౌర కార్యకలాపాల ముఖ్య రంగాలనూ, కిందిస్థాయి పార్టీ సంస్థలనూ పటిష్ఠం చేయటానికి పార్టీ యంత్రాంగ పునర్వ్యవస్థీకరణ నూ, దాని సిబ్బందిలో ఒక భాగం తగ్గింపునూ చేపట్టాలి. ఈ సందర్భంలో ప్రజాప్రతినిధుల సోవియట్ల యంత్రాంగాన్ని ప్రజా అజమాయిషీ సంస్థలను పటిష్టం చేయడం పట్ల ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

పార్టీ కమిటీల యంత్రాంగానికి చెందిన ప్రాథమిక పార్టీ సంస్థలు దాని పునర్వ్యవస్థీ కరణలో క్రియాశీలంగా పాల్గొనేలా చూడాలి.

2. హుకుముల ద్వారా మార్గదర్శకత్వం వహించే పద్ధతులను, పార్టీకమిటీల కార్యకలాపా లలో టెక్నోక్రాటిజం వ్యక్తీకరణలను పట్టుదలతో తొలగించటం, పార్టీ, పౌర జీవితంలో ప్రజాతంత్ర సూత్రాలను స్థిరపర్చటం అతి ముఖ్యమని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ భావిస్తోంది.

నూతన పరిస్థితుల్లో పార్టీ పని పద్ధతులను జాగ్రత్తగా అధ్యయనం చేసి బేరీజు వేయడం, రాజకీయ, ఆర్థిక, సామాజిక, ఆత్మిక రంగాలలో సంభవిస్తున్న పరిణామ క్రమాలను విశ్లేషించడం, అత్యుత్తమ అనుభవ వ్యాప్తికి దోహదం చేయడం అవసరం.

3. పార్టీ యంత్రాంగానికి సిబ్బందిని ఎంపిక చేసి నియమించడం పట్ల పార్టీ కమిటీలు, వాటి బ్యూరోలు, కార్యదర్శులు మరింత శ్రద్ధవహించాలి; ఉన్నతమైన నైతిక గుణాలు, కొత్త పద్ధతిలో పనిని వ్యవస్థీకరించగల శక్తి కలిగిన రాజకీయంగా పరిణ తులైన, సుశిక్షితులైన కమ్యూనిస్టులను పార్టీ యంత్రాంగంలో నియమించాలి.

పార్టీ యంత్రాంగంలో సిబ్బందినియామకాని కి ప్రాథమిక పార్టీ సంస్థ సిఫార్సు తప్పని సరిగా అవసరం. పార్టీ పనిలో నియామకానికి ఒక కమ్యూ నిస్టును సిఫార్సు చేసిన పార్టీ సంస్థ; అతనిపై వుంచిన విశ్వాసానికి అతడు న్యాయంచేయలేదని తేలితే అతణ్ణి పదవి నుంచీ తొలగించే సమస్యను లేవనెత్తే హక్కు ఆ పార్టీ సంస్థకు ఉంటుంది.

4. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యంతాంగపు నూతన నిర్మాణరూపాన్ని పరిశీ లించి ఆమోదించవలసిందిగా పొలిట్‌బ్యూరోను కేంద్ర కమిటీ ఆదేశిస్తోంది. రిపబ్లికన్, ప్రాదేశిక, మండల పార్టీ సంస్థల విషయంలో విధుల లోని మార్పులను పరిగణనకు తీసుకొని, ఆమోదింపబడిన వేతన నిధి పరిమితులకులోబ డి, తమ సమస్తపార్టీ కమిటీల, పార్టీ ఇన్‌స్టిట్యూట్ల నిర్మాణ రూపానికీ, సిబ్బందికీ సంబంధించిన

సమస్యలను స్వతంత్రంగా పరిష్కరించుకునే హక్కును యూనియన్ రిపబ్లిక్కుల తాలూకు కమ్యూనిస్టు పార్టీల కేంద్రకమిటీలకూ, పార్టీ ప్రాదే శిక, మండల కమిటీలకూ ఇస్తూనే, స్థానిక పార్టీ సంస్థల యంత్రాంగంలోని ప్రధానమైన అంతస్తు లను నిర్ధారణ చేయవలసిందిగా కూడా కేంద్ర కమిటీ పొలిట్ బ్యూరోను ఆదేశిస్తోంది.

## విదేశాంగవిధాన సమస్యలు

### ప్రపంచంలోని ఉద్రిక్తతా ఆలవాలాలు

# అఫ్గనిస్తాన్: సోవియట్ సైన్యాల ఉపసంహరణానంతరం

వి.పి. ఛాబ్లా

సోవియట్ యూనియన్ ప్రకటించిన ప్రకారమూ, జెనీవా ఒప్పందాలకు అనుగుణంగా అఫ్గనిస్తాన్ నుండి సోవియట్ సైన్యాల ఉపసంహరణ జరుగుతోంది. యిప్పటి వరకూ 30,000 లకు పైగా సైనికులూ, సైనికాధికారులూ తమతమ ఆయుధాలతో సహా సోవియట్ యూనియన్‌కు చేరుకొన్నారు. సోవియట్ ప్రభుత్వం ముందుగా ప్రకటించిన ప్రకారం సోవియట్ సైన్యాల్లో 50 శాతాన్ని యిప్పటికే వుపసంహరించడం జరిగింది. జెనీవా ఒప్పందాలను సోవియట్ యూనియన్ కచ్చితంగా పాటిస్తున్నట్టు యిది తెలియజేస్తోంది.

కాని జెనీవా ఒప్పందాల ప్రకారం తాను స్వీకరించిన నిబద్ధతలను పాకిస్తాన్ నాయకత్వం నిరంతరం వుల్లంఘిస్తూండడం వల్ల భవిష్యత్తులోకి ఆశావాదంతో చూడ లేక పోతున్నాం. "అఫ్గనిస్తాన్ తాత్కాలిక పోటీ ప్రభుత్వాన్ని" తన దేశంలో ఏర్పాటు చేసుకోడానికి పాకిస్తాన్ అనుమతించింది; తద్వారా అఫ్గన్-పాకిస్తాన్ ఒప్పందం ప్రకారం స్వీకరించిన నిబద్ధతలను పూర్తిగా వుల్లంఘించింది. ఉద్రిక్తతా వాతావరణాన్ని రెచ్చగొట్టడమే అఫ్గనిస్తాన్ ఆంతరంగిక సమస్యల పట్ల పాకిస్తాన్ వైఖరిగా వున్నట్లు దాని చర్యలు సుస్పష్టంగా తెలియజేస్తున్నాయి. విస్తృత ప్రాతిపదికపై ప్రభుత్వాన్ని యేర్పాటు చేసుకునేందుకు ఆమోద యోగ్యమైన చర్యలను రూపొందించడానికి అఫ్గన్ ప్రజలు చేస్తున్న కృషికి పాకిస్తాన్ చర్యలు యేమాత్రం తోడ్పడవు.

అఫ్గనిస్తాన్ ఆంతరంగిక సమస్యల్లో జోక్యం చేసుకోకుండా వుండడానికి బదులుగా వాటిని రెచ్చగొట్టడానికి పాకిస్తాన్ నాయకత్వం పనిచేస్తున్నట్టు దాని ధోరణి స్పష్టంచేస్తోంది. జెనీవా ఒప్పందాలు అమల్లోకి వచ్చిన తర్వాతకూడా అఫ్గనిస్తాన్ ఆంతరంగిక వ్యవహారాల్లో పాకిస్తాన్ బరితెగించి జోక్యం చేసుకుంటూ ఆ ఒప్పందాలను వుల్లంఘిస్తున్నదని సోవియట్ యూనియనూ, అఫ్గనిస్తాన్ రిపబ్లిక్కూ అనేకసార్లు తిరుగులేని రుజువులను చూపాయి. యీ ఒప్పందాల ప్రకారం భాగస్వాములు స్వీకరించిన నిబద్ధతల సమతూకాన్ని పాకిస్తాన్ నాయకత్వపు చర్యలు వెన్నుపోటు పొడుస్తున్నాయి; అఫ్గనిస్తాన్ పరివేష్టిత ప్రాంతాల్లో రాజకీయ పరిష్కారాన్ని సాధించ తలపెట్టిన చర్యల అమలును సందేహాస్పదంగా చేస్తున్నాయి.

జెనీవా ఒప్పందాలకు కాబూల్, మాస్కోలు మాత్రమే కట్టుబడి వుండాలనే-యీ ఒప్పందాల యేకైక లక్ష్యం సోవియట్ సైన్యాల ఉపసంహరణను సాధించి, ఆవిధంగా తన కక్షను తీర్చుకోడానికి, యింకా చెప్పాలంటే దురాక్రమణకుగాను అఫ్గనిస్తాన్‌లో అల్లకల్లోల, రక్తపాత బీజాలు నాటడానికి రంగాన్ని సిద్ధంచేయడానికనే — నమ్మకంతో పాకిస్తాన్ నాయకత్వం వ్యవహరిస్తున్నట్టు కనిపిస్తోంది. "ప్రాంతీయస్థిరత్వమూ, దక్షిణాది ఆసియాలో భద్రత" అనే అంశంపై జరిగిన అంతర్జాతీయ గోష్టిలో పాకిస్తాన్ అధ్యక్షుడు ప్రసంగిస్తూ అఫ్గన్ తిరుగుబాటుదార్లకు తన పూర్తి మద్దతును ప్రకటించారు, తుదకు వారి విజయం ఖాయమేనన్నారు. కాబూల్ మసీదులో ఆ సందర్భంగా ప్రార్థన జరపడానికి కూడా వస్తానని వాగ్దానం చేసేంతవరకు వెళ్ళారాయన. అలాంటి ప్రకటనలు చట్టబద్ధ అఫ్గన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా శత్రుచర్యలను ప్రత్యక్షంగా, నగ్నంగా పెంపొందించి, ప్రోత్సహించి బలపర్చడం తప్ప మరేటికాదు. యివి ఆఫ్గన్—పాక్ ద్వైపాక్షిక ఒప్పందానికి పూర్తిగా విరుద్ధం. అంతేకాదు పాకిస్తాన్ సర్వసైన్యాధ్యక్షుడైన అధ్యక్షుడు జియావుల్‌హక్ అఫ్గన్ తిరుగుబాటుదార్ల "చర్యల వ్యూహాత్మక పథకాన్ని పరిశీలించి, ఆమోదించి"-నట్టు తెలిసింది. పాకిస్తాన్ భూభాగంనుండి తమ కార్యకలాపాలను సాగిస్తున్న అఫ్గన్ వ్యతిరేక సాయుధదాడి బృందాల పథకాలతో సైనికంగా మనమే కంకావాలని పాకిస్తాన్ అధ్యక్షుడు నిర్ణయించినట్టు యిది తెలియజేస్తోంది. సార్వభౌమాధికార అఫ్గనిస్తాన్ ఆంతరంగిక వ్యవహారాల్లో ప్రత్యక్షసాయుధ జోక్యం అంతర్జాతీయ శాసనానికి ఐ.రా.స నిబంధనావళికి, జెనీవా ఒప్పందాలకు పూర్తి విరుద్ధమని వేరే చెప్పనవసరంలేదు. అంతేకాదు యిలాంటి చర్యలు యీ మండలంలోని పరిస్థితిలో తీవ్రపర్యవసానాలను తెచ్చిపెడతాయి. (పాక్ అధ్యక్షులు జియా వుల్‌హక్ యిటీవలే విమాన. ప్రమాదంలో మరణించారు).

అఫ్గనిస్తాన్ ఆంతరంగిక వ్యవహారాల్లో సైనికంగా జోక్యం చేసుకోడానికి వీలుగా పాకిస్తాన్‌కు దాని పోషకులనుండి, ముఖ్యంగా అమెరికానుండి పెద్దయెత్తున సైనిక, ఆర్థిక సహాయం లభిస్తూనేవుంది. అఫ్గన్ ప్రజల విషాద పరిస్థితి నుండి పాక్‌పాలకవర్గం లబ్దిపొందుతూనేవుంది; అందుకోసం అఫ్గనిస్తాన్‌లోని పరిస్థితి కుదుటపడకుండా వుండడానికి చేయగలిగినదంతా చేస్తోంది. అగ్రశ్రేణి రాజ్యంగా తనహోదాను యేవిధంగానైనా నిలబెట్టుకోవాలని పాకిస్తాన్ ఉద్దేశం. యీమండలంలోని పరిస్థితి కుదుటపడితే పాకిస్తాన్‌కు ఆహోదాలేకుండా పోతుంది. దాని పోషకులనుండి నిరంతర అధునాతన ఆయుధాల సరఫరా, ఆర్థిక సహాయం బాగా తగ్గిపోతుంది, లేదా నిలిచిపోతుంతి. అఫ్గన్ సమస్యకు శాంతియుత పరిష్కారాన్ని సాధించే మార్గంలో అమెరికా ప్రభుత్వం అవరోధాలు సృష్టిస్తూనేవుంది; అఫ్గన్ భూభాగంలోని ప్రభుత్వ వ్యతిరేక దళాలకు పెద్దయెత్తున ఆయుధాలను పాకిస్తాన్‌ద్వారా అందజేస్తోంది. జెనీవాలో కుదిరిన ఒప్పందాలను ఆయాదేశాలు కచ్చితంగా పాటిస్తేనే అఫ్గనిస్తాన్‌లో శాంతి సాధ్యమనే అసలు వాస్తవాన్ని అమెరికా చూడనిరాకరిస్తోంది. అఫ్గనిస్తాన్ విషయంలో కుదిరిన జెనీవా ఒప్పందాలను సోవియట్ యూనియన్ తు.చ. తప్పకుండా పాటిస్తోంది; దాని ప్రకారం స్వీకరించిన నిబద్ధతలకు పూర్తిగా కట్టుబడి వుంటోంది. అఫ్గన్ సమస్యను త్వరితంగా, నిరాటంకంగా పరిష్కరించే క్రమాన్ని పెంపొందించేందుకు అది నిరంతరం కృషిచేస్తోంది.

09-6

# గోర్కీపై టాల్‌స్టాయ్ ప్రభావం

ఎస్. సెరెబ్ర్యానీ

క్యాండిడేట్ ఆఫ్ సైన్స్ (ఫైలాలజీ), సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీకి చెందిన గోర్కీ ప్రపంచ సాహిత్య అధ్యయన సంస్థ;

నిజంగా గొప్ప వ్యక్తులు తమ మరణానంతరంకూడా తమ రచనలు, భావాలద్వారా, ఇంకా చెప్పాలంటే, భావితరాల స్మృతిపథంలో నిల్చిపోవడంద్వారా మానవాళికి సేవచేస్తూ ఉంటారు. దీనిలోనే ఉందివారి గొప్పదనం. రానున్న తరాలకు వారి సేవ విస్మృతీ, ప్రాముఖ్యత కాలంగడిచే కొద్దీ పెరుగుతూనే ఉంటుంది.

టాల్‌స్టాయ్ మరణించి దాదాపు ఏనభై సంవత్సరాలు గడిచిపోయాయి. ప్రపంచంలో ఆయన కీర్తి తగ్గలేదు. సరికదా నిరంతరం పెరుగుతూనే ఉంది. టాల్‌స్టాయ్ అతిముఖ్యమైనదిగా భావించిన ఆశయానికి, అంటే ప్రజలను సమైక్య పర్చాలన్న ఆశయానికి ఆయన వారసత్వం తోడ్పడుతూనే ఉంది. భారతదేశం, సోవియట్ యూనియన్‌లను ఏకంచేయడమన్న ఆశయసాధనలో, వాటిమైత్రీ, సహకారాల ఆశయసాధనలో ఆయన పాత్ర బహుశా ప్రత్యేకించి గురుతరమైనది.

తరచుగా చేదు గుణపాఠాలను నేర్పే చరిత్రలో యిప్పుడు మనకు ఆశ్చర్యకరమైన అపూర్వపరిణామం కనిపిస్తోంది. అదేమంటే నూతన రష్యన్ సంస్కృతిలోని యెంతో గొప్ప వారిలో ఒకరైన టాల్‌స్టాయ్ ప్రత్యేకించి భారతదేశంలో సుప్రసిద్ధులయ్యారు; 20వ శతాబ్దపు భారత సంస్కృతిలో ప్రత్యేకించి ముఖ్యులయ్యారు. ఇటలీ రచయిత ఆల్బర్ట్ మొరావియా చెప్పినట్లు, టాల్‌స్టాయ్ భారతదేశంలో ఒకరకమైన పురాణ పురుషుడయ్యారు. టాల్‌స్టాయ్ పేరు అందరికీ తెలిసు. కాని భారతీయులు ఈగొప్ప రష్యన్ యూరపియన్ రచయిత గురించి యింకా యెంతో తెలుసుకోవాల్సివుంది, ఆయన సాహిత్య వారసత్వాన్ని మధించాల్సి ఉంది.

టాల్‌స్టాయ్ గురించిన అధ్యయనంలో సోవియట్, భారత పండితుల మధ్య సహకారం ఫలవంతమైనదిగా రుజువుకాగలదు. వారి సంయుక్త కృషి వల్ల ఉభయదేశాల మధ్య అవగాహన పెరుగుతుంది. ఒకరిని గురించి మరొకరికిగల పరిజ్ఞానం పెరుగుతుంది.

మనం ఒకరిగురించి మరొకరు బాగా తెలుసుకున్నా మనీ, చేయవలసిందల్లా ఆపరిజ్ఞానస్థాయి తగ్గకుండా చూడటమూ, తమ జీవితంలోని తాజా విషయాలను పరస్పరం తెలియజేసుకోవడంమూ నన్న నమ్మకంతో మనం ఉబ్బిపోరాదు. వాస్తవానికి మనకు ఒకరిగురించి ఒకరికి తెలిసింది బహుతక్కువ. మనకిప్పటికీ తగినంత పరస్పర అవగాహన లేదు మనదేశాలసాంస్కృతికసంప్రదాయాలచరిత్రల ప్రత్యేకత లను తెలుసుకోవడం అంత సులభమైన విషయంకాదు. మనదేశాలు సంపూర్ణ పరస్పర పరిజ్ఞానం సంపాదించడానికి చేయవలసింది యెంతో ఉంది. ఈకృషికి టాల్‌స్టాయ్‌ను గురించిన అధ్యయనం యెంతో ఉపయోగపడుతుంది. ఆయన పేరు, వారసత్వం బహుశా రష్యాకు, భారతదేశానికిగల ప్రధాన అనుబంధాల్లో ఒకటి. టాల్‌స్టాయ్‌ను గురించి తమకుగల పరిజ్ఞానం పెంచుకోవడం ద్వారా భారతీయులు మనలను మరింత లోతుగా అర్థంచేసుకోగలుగుతారు. మనవంతుకు మనం టాల్‌స్టాయ్‌ని గురించి భారతీయుల భావనలను అధ్యయనం చేయడంద్వారా భారతదేశాన్ని మరింత బాగా అర్థంచేసుకోగలుగుతాము. మనదేశీయుడైన ఈమహానీయుని కృషికి గల ప్రపంచవ్యాప్త ప్రాముఖ్యాన్ని మరింత చక్కగా గ్రహించగలుగుతాము.

భారతదేశంలో టాల్‌స్టాయ్ గురించిన అధ్యయనం విషయానికి వస్తే, మొట్టమొదట గాంధీపేరును పేర్కొనాలి. టాల్‌స్టాయ్‌కు భారతదేశంలో ఇంత పేరురావడానికి కారణం ఈరష్యన్ రచయితతో గాంధీ ఉత్తరప్రత్యుత్తరాలు జరపడమూ, ఆయనను తన గురువులలో ఒకరుగా పేర్కొనడమూనే;

టాల్‌స్టాయ్, గాంధీ అనే విషయంపై అనేక పుస్తకాలు వెలువడ్డాయి. అయినప్పటికీ వీటి రచయితలంతా ప్రశంసలు కురిపిస్తూ వీరి మధ్య సంబంధాలను గురించే, వీరి సామాజిక—రాజకీయ, మత భావాల సారూప్యతలు, భేదాలను గురించే, గాంధీజీ భావజాల పరిణామంపై టాల్‌స్టాయ్ ప్రభావం గురించే రాశారు. శాస్త్రీయత, విశ్లేషణల కన్నా ఉత్సాహానిదీ, ప్రశంసా భావానిదీ మాత్రమే పైచేయి కావడం యిందుకు కారణం. కాని, యింతవరకూ యెవరూ తగినంత అధ్యయనం చేయని విషయాలను గురించి నేనీవ్యాసంలో చెబుతాను.

రష్యన్—భారత సాహిత్య సంబంధాలపై సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీకి చెందిన గోర్కీ ప్రపంచ సాహిత్య అధ్యయనసంస్థ చేసిన అధ్యయనాన్ని పరిశీలించినప్పుడు, గాంధీ తన జీవితకాలంలో ఏఏ టాల్‌స్టాయ్ గ్రంథాలను చదివారు, వాటిపై ఏఏ అభిప్రాయాలు ప్రకటించారు అన్న విషయంపై నాకు ఆసక్తి కలిగింది. గాంధీ ఆత్మకథ, తదితర గాంధీ రాసిన గ్రంథాలను పరిశీలించాను.

1925లో రాసిన తన ఆత్మకథలో గాంధీ "దేవుని రాజ్యం నీలోనే ఉంది", "సువార్త సంగ్రహం", "అప్పుడు మనమేం చేయాలి" అన్న మూడు టాల్‌స్టాయ్ రచనలను మాత్రమే పేర్కొన్నారు. ధూమపానం, మద్యపానాలకు వ్యతిరేకంగా టాల్‌స్టాయ్ రాసిన "జనంమత్తు ద్రవ్యాలను

ఎందుకు తీసుకుంటారు?'' అన్న వ్యాసంలోని భావాలను దానిపేరు చెప్పకుండా వివరించారు. టాల్‌స్టాయ్ తన సామాజిక—రాజకీయ అభిప్రాయాలను దాదాపు పూర్తిగా పేర్కొన్న ''దేవుని రాజ్యం నీలోనే ఉంది'' అన్న గ్రంథాన్ని గాంధీ మొట్టమొదట 1893లో దక్షిణాఫ్రికాలో చదివారు. యీగ్రంథం తనను ముగ్ధుణ్ణి చేసిందనీ, తన మనసుపై చెరగని ముద్రవేసిందనీ, ఈపుస్తకంలోని స్వతంత్ర తార్కికత, ప్రగాఢమైన నీతి, సత్యసంధత — యివి, మిస్టర్ కోట్స్ (ఆకాలంలో గాంధీ మిత్రుడు—రచయిత) చదవమని చెప్పిన యితర పుస్తకాలు ఈపుస్తకం ముందు వెలవెలబోతాయనీ ఆయన తన ఆత్మకథలో రాశారు. దీన్ని ఆయన 1908లో జోహన్స్‌బర్గ్‌లోని వోల్‌స్రస్ట్ జైల్లో మరోసారి చదివారని ఆయన సంకల్పిత రచనల సంపుటి ద్వారా తెలుస్తూంది.

టాల్‌స్టాయ్ శత జయంతి సందర్భంగా అహ్మదాబాదులో గాంధీజీ 1928 సెప్టెంబర్ 10న యువజనులనుద్దేశించి చేసిన ప్రసంగంలో ఆయనను గురించి వివరంగా చెప్పారు. గాంధీ చెప్పిన విషయాల్లో కొన్నిటిని పేర్కొంటున్నారు. ''......నాజీవితంపై ముగ్గురు వ్యక్తులు చాలా గొప్ప ప్రభావం నెరపారని నేను చెప్పాలి. వీరిలో అగ్రస్థానం రాజ్‌చంద్రకవిది. ద్వితీయ స్థానం టాల్‌స్టాయ్‌కి మూడవస్థానం రస్కిన్‌కు చెందుతుంది..... మిగిలిన వాళ్ళలా నేను టాల్‌స్టాయ్ జీవితచరిత్రను చదవలేదు. వాస్తవానికి ఆయన రచనలనుకూడా అన్నిటినీ చదవలేదు. ఆయన రచనల్లో నాపై అత్యంత ప్రభావం నెరిపింది 'దేవుని రాజ్యం నీలోనే ఉంది' అన్న గ్రంథం....అతర్వాత నేను ఆయన ఇతర పుస్తకాలు కొన్ని చదివాను. అయినప్పటికీ అవినాపై ఏమి ప్రభావం నెరపాయో వివరించలేను. ఆయన జీవితం మొత్తంగా నాపైన యెలాంటి ప్రభావం నెరపిందో మాత్రమే నేను చెప్పగలను''.

టాల్‌స్టాయ్ రచనల్లో గాంధీ వేటిని చదివారో, వేటిని ఆసక్తికరమైనవని అనుకున్నారో ఆయన యితర రచనలు, లేఖలు సూచిస్తున్నాయి.

తన స్నేహితుడైన హెన్రీ పోలక్‌కు గాంధీ1909లో రాసిన లేఖలో ''జీవితాన్ని గురించి'' ''కన్ఫెషన్'' అనే టాల్‌స్టాయ్ వ్యాసాలను చదివానని రాశారు. తన పుస్తకం ''హింద్ స్వరాజ్ లేక ఇండియన్ హోమ్‌రూల్‌కు''కు (1909) అనుబంధపట్టికలో చదవదగినవని సూచించిన 20 పుస్తకాల్లో ఆరు టాల్‌స్టాయ్ రాసినవే. అవి: ''దేవుని రాజ్యం నీలోనే ఉంది'', ''కళ అంటే ఏమిటి'', ''మన కాలంలోని బానిసత్వం'', ''హిందువుకు లేఖ'' అనే రచనలూ, ''తొలి అంజ'' అనే వ్యాసమూ, ''మనం ఎలా తప్పించుకోగలం?'' అనే పుస్తకము. 1910లో ''స్త్రీ, పురుషుల సంబంధం'' అనే టాల్‌స్టాయ్ రాసిన చిన్న పుస్తకాన్ని గాంధీ తనమేనల్లుడికి పంపుతూ, దాన్ని ''అమూల్య, గ్రంథం'' అని అభివర్ణించారు. ''సత్యాగ్రహులకు సూచనలు'' అనే తన 1919 నాటి రచనలో చదవడానికి సిఫార్సు చేసిన పుస్తకాల్లో టాల్‌స్టాయ్ రచన ''రష్యన్ ఉదారవాదులకు లేఖ'' కూడా ఉంది. ''సొంతంగా కష్టపడి తిండి సంపాదించుకోవలసిన'' ఆవశ్యకతను వివరిస్తూ టాల్‌స్టాయ్ రాసిన గ్రంథాలనుకూడా ఆయన తరచు ప్రస్తావించేవారు.

ఇంతవరకూ టాల్‌స్టాయ్ మత, తాత్విక, ప్రచార రచనలను మాత్రమే మనం పేర్కొన్నాము. ఇక, ఆయన కల్పనా సాహిత్యాన్ని చూద్దాం. ''ప్రజల కోసం కథలు'' అన్న గ్రంథంలోని మూడు కథలను (''దేవుడు నిజం గ్రహిస్తాడు కాని తొందరగా చెప్పడు'', ''తెలివి తక్కువ ఇవాన్ కథ'', ''మనిషికి ఎంతనేల కావాలి'') మనం నమ్మకంగా పేర్కొనవచ్చు. వీటిని 20వ శతాబ్దారంభంలోనే గుజరాతీ భాషలోకి అనువదించి ఇండియన్ ఒపీనియన్ అన్న తన పత్రికలో గాంధీ ప్రచురించారు.

''తెలివి తక్కువ ఇవాన్ కథ'' చివరివరకూ గాంధీ అభిమాన రచనగా ఉంటూ వచ్చింది. 1948 జనవరి 27న అమెరికన్ పాత్రికేయుడు — మార్టిన్‌కు ''హింసా రహిత ప్రతిఘటన'' భావాన్ని వివరిస్తూ పైకథను పేర్కొన్నారు. ఇది బహుశా, ఒక బౌద్ధజాతక కథకు రష్యన్ పాఠం కావచ్చునని టాల్‌స్టాయ్ పరిశోధకుల ఊహ. ఇది గనుక నిజమైతే హింసారహిత ప్రతిఘటనను



# ల్యేవ్ టాల్‌స్టాయ్

1910 నాటి ఫోటో

బోధించే ఈభారతీయ కథ రష్యన్ అనుకరణ, భారతీయుని హృదయాన్ని దోచుకోవడానికి మళ్ళీ భారతదేశం వచ్చిందన్నమాట. గాంధీ ప్రభావం లేకుంటే ఇది అనేక భారతీయ భాషల్లోకి అనువాదం అయ్యేదికాదు.

''యుద్ధము—శాంతి'', ''అన్నా కెరెనినా'' ''పునరుత్థానం'' అనే టాల్‌స్టాయ్ నవలలు ప్రపంచ సాహిత్యంలోనే అతిగొప్ప నవలలని రష్యన్‌ల, యితర యూరపియన్ దేశ పాఠకుల అభిప్రాయం. గాంధీ ఆత్మిక ప్రపంచంలో టాల్‌స్టాయ్ నవలల పాత్ర ఏమిటన్న ప్రశ్న సహజంగానే ఉత్పన్నమౌతుంది. వాస్తవానికి ఏమీ లేదన్నదే సమాధానం. గాంధీజీ కలెక్టెడ్‌వర్క్స్‌లో టాల్‌స్టాయ్ నవలల ప్రస్తావన ఒకటి కూడా లేదు.

1984లో ముల్కరాజ్ ఆనంద్‌ను సోవియట్ యూనియన్‌లోనేను కలుసుకున్నప్పుడు ఆయనతో ఈవిషయం చర్చించాను. ఆయన గాంధీజీతో బాగా పరిచయమున్న వ్యక్తి. ఆయనకు టాల్‌స్టాయ్ రచనలు తెలిసింది గాంధీ వల్లనే. బహుశా గాంధీ టాల్‌స్టాయ్ నవలలు చదివి ఉండరనీ, బహుశా, వాటిపట్ల ఆయనకు అసలు ఆసక్తే లేకపోయి ఉండవచ్చుననీ ముల్కరాజ్ ఆనంద్ చెప్పారు. ఆతర్వాత ఇష్టాగోష్టిలో యితర భారతీయ పండితులుకూడా ఇదే చెప్పారు.

ఆనంద్ చెప్పిన విషయం విని మొదట ఆశ్చర్యపోయినా తర్వాత అందులో ఆశ్చర్యమేమీ లేదని నాకు అనిపించింది. దీనికి మూడు కారణాలున్నాయి. మొదటిది. టాల్‌స్టాయ్ ఉత్తరోత్తరా, ''కన్ఫెషన్'' లో యితర అనేకరచనల్లో వ్యక్తంచేసిన అభిప్రాయాన్ని గాంధీ నమ్మి ఉండవచ్చు. రెండవది గాంధీ సాహిత్య అభిరుచులు సాంప్రదాయిక బారతీయ సంస్కృతికి చెందినవి. మూడవది. గాందీ ప్రధానంగా కర్మయోగి. గ్రంథపఠనం, ముఖ్యంగా, సమకాలీన కాల్పనిక సాహిత్యం చదవడం ఆయన గాఢ అభిరుచుల్లో ఒకటి కాదు.

గాంధీ బాల్యం సాంప్రదాయక కుటుంబ వాతావరణంలో గడిచిందని, యువకుడైన మహాత్మా గాంధీకి తులసీదాస్ రామాయణం, భాగవత

పురాణం, అభిమానపాత్రగ్రంథాలయ్యాయని ఆయన ఆత్మకథనుంచే తెలుస్తోంది. అయితే, చదవడంద్వారా కాక వినడంద్వారా వీటితో ఆయనకు పరిచయం ఏర్పడింది. పెద్దవాడైన తర్వాత భగవద్గీత ఆయనకు అత్యభిమాన పాత్ర మైన పుస్తకాల్లో ఒకటైంది. బ్రిటన్‌లో ఆయన లాచదువుకుంటున్నప్పుడు బ్రిటిష్ కల్పనా సాహిత్యం, మొత్తం పాశ్చాత్య దేశాల నవలలు, కథలు ఆయన్ను ఆకర్షించలేదు. టాల్‌స్టాయ్ ప్రసిద్ధ నవలలు "యుద్ధము—శాంతి", "అన్నా కెరెనినా" మొదలైన వాటి ఇంగ్లీషు అనువాదాలు చదివే అవకాశం ఆయనకు లభించింది, కాని చదువలేదు. ఆయన ఆత్మకథలో భగవద్గీతనుండి ప్రస్తావనలు, ప్రాచీన భారతీయ మతకవుల రచనలనుండీ ఉల్లేఖనలు కనిపిస్తాయి. కానీ, యూరపియన్ ఉద్గ్రంథాలనుంచీ ఒక్క ఉల్లేఖన కూడా లేదు. కాని, జవహర్‌లాల్ నెహ్రూ స్వీయ చరిత్రలో యూరపియన్ రచయితల గ్రంథాల నుంచీ ఉల్లేఖనలు కోకొల్లలుగా వున్నాయి.

గాంధీ మహోన్నత వ్యక్తిత్వాన్ని తక్కువ చేసి చూడడానికి నేనీ విషయం చెప్పలేదు. యూరపియన్ సంస్కృతినుంచీ ఎంతో స్వీకరించినప్పటికీ ఆయన పూర్తి భిన్నమైన సంస్కృతికి చెందినవారు. 20 వ శతాబ్దంలోకూడా వివిధ సంస్కృతుల మధ్య ఎంతటి అఖాతం ఉందో మనం గుర్తుంచుకోవాలి. సాంకేతిక శాస్త్రం, కమ్యూనికేషన్స్‌వంటి పాదార్థిక సంస్కృతి ప్రపంచాన్ని ఐక్యం చేస్తూంది. కానీ ఆత్మిక, మేధా సంస్కృతిలో మానవాళి యింకా అనైక్యంగానే వుందనే విషయం మనం తరచుమరిచి పోతుంటాం.

టాల్‌స్టాయ్ గొప్ప నవలాకారుడనీ రష్యన్ల అభిప్రాయం. పాశ్చాత్య యూరప్, అమెరికాల్లోని వారి అభిప్రాయంకూడా యిదే. ఎందుకంటే వారందరి సంస్కృతికూడా ఒక్కటే. కానీ, భారత దేశం సంగతి వేరు. టాల్‌స్టాయ్‌ని గురించిన గాంధీ పాక్షిక అవగాహన ఆయన వ్యక్తిత్వానికి, జీవితానికి ప్రత్యేకమైన లక్షణంకాదు. అది 20వ శతాబ్దంలో వివిధ సంస్కృతుల పరస్పర ప్రభావానికి ప్రతిబింబం. పాశ్చాత్య సంస్కృతితో మరింత సమగ్రమైన పరిచయంగల భారతీయులుకూడా టాల్‌స్టాయ్ నవలలను అర్థంచేసుకోవడంలో కొంత తికమకపడ్డారు. విశ్వమానవ మేధస్సు సాధించిన విజయాలనూ, దాని అభివ్యక్తినీ ఆకళించుకో ప్రయత్నించిన రవీంద్రనాథ్ టాగూర్‌వంటి వారికి కూడా యిది వర్తిస్తుంది.

గాంధీ, నెహ్రూల మధ్య తేడాలను గురించి ఎందరో, ఎంతో రాశారు. కాబట్టి, టాల్‌స్టాయ్ నవలలపట్ల వారిద్దరి వైఖరులను పోల్చిచూడటం ఆసక్తికరమైన విషయం. టాల్‌స్టాయ్ నవలలను గాంధీ అసలు పట్టించుకోనేలేదు. కానీ, నెహ్రూపై వాటి ప్రభావం గొప్పదే. 1934 ఏప్రిల్ 4న నెహ్రూ తన జైలు డైరీలలో "యుద్ధము—శాంతి" అద్భుత గ్రంథమని పేర్కొన్నారు. దాన్నీ "అన్నా కెరినినా" నూ చదవవలసిందిగా తన కూతురుకు 1935 ఫిబ్రవరి 22న రాసిన లేఖలో తెలిపారు. 1944 లో జైల్లో ఉన్నప్పుడు "అన్నా కెరినినా"ను తనకు పంపవలసిందిగా తన కుటుంబానికి ఆయన పలుమార్లు రాశారు.

గాంధీ నెహ్రూలు భారతీయచేతనలోని భిన్న పార్శ్వాలకు ప్రతినిధులు. టాల్‌స్టాయ్‌పట్ల గాంధీ వైఖరి భారతీయ సమాజంలోని అత్యధిక భాగం వైఖరికి మచ్చుతునక. భారతీయ భాషల్లో అనువదించిన టాల్‌స్టాయ్ రచనల చరిత్ర దీన్ని ధ్రువీకరిస్తోంది. ఇంగ్లీషు భాష తెలిసిన భారతీయులు టాల్‌స్టాయ్ రచనల ఇంగ్లీషు అనువాదాలనె చదివారు. కాని, ఇంగ్లీషురాని లక్షోపలక్షల భారతీయులకు అభిమాన పాత్రమైనవి టాల్‌స్టాయ్ నవలలు కాదు. టాల్‌స్టాయ్ కథలు ("ప్రజల కోసం కథలు"), పిల్లలు కోసం ఆయన రాసిన కథలు, ఆయన తాత్విక రచనలు అంటే వారికెంతో ఇష్టం. "ప్రజలకోసం కథలు", పిల్లల కథలు భారతదేశంలో అపారమైన ప్రజాదరణ పొందాయి. భారతీయ భాషలలోకి అనువాదమైన టాల్‌స్టాయ్ కథలు, ముఖ్యంగా పిల్లల కథలు భారతదేశంలోని కొన్ని రాష్ట్రాల్లో ప్రాథమిక పాఠశాల విద్యార్థులు చదవాలని సిఫార్సు చేసిన సందర్భాలు నాకు తెలుసు.

ఇదంతా సంస్కృతి చరిత్రకారులు, సాహిత్య విమర్శకులు, ఇతర పండితులు ప్రత్యేకించి గమనించవలసిన విషయం.

ఒకమత చింతనా పరుడుగా టాల్‌స్టాయ్ పట్ల భారతీయులు ఎందుకంత ఆసక్తి చూపుతున్నారు? రామమోహనరాయ్ మొదలుకొని గాంధీవరకు

# గాంధీజీపై టాల్‌స్టాయ్ ప్రభావం

గల 19వ, 20వ శతాబ్దాల భారతీయ మత సంస్కర్తల అన్వేషణలకు. టాల్‌స్టాయ్ మతపరమైన అన్వేషణలకు మధ్య సారూప్యముండటమే యిందుకు కారణమని నాభిప్రాయం. క్రైస్తవమతంలోని ఆన్యలక్షణాలను వేరుచేసి, దాన్ని పరిశుద్ధంచేసి "ఆదిమ", "నిజమైన" క్రైస్తవమతాన్ని కనుగొనడానికి టాల్‌స్టాయ్ కృషిచేశారు. అలాగే రామమోహనరాయ్, దయానందసరస్వతి,మహాత్మా గాంధీలు తమ పద్ధతుల్లో హిందూమతాన్ని పరిశుద్ధం చేయ ప్రయత్నించారు. తన జీవితచరమకాలంలో టాల్‌స్టాయ్ మరింత ముందుకు వెళ్ళి క్రైస్తవమతాన్ని మించిన విశ్వమానవ మతాన్ని స్థాపించాలని (మానవాళి సమస్త మహోన్నత ఆత్మిక విజయాలను తనలో ఇముడ్చుకున్న మతం) అనుకొన్నారు. ఆయన ఈవిషయంలో రవీంద్రనాథ టాగూర్‌కు దగ్గరగా వచ్చారు. తన జీవిత చరమకాలంలో టాల్‌స్టాయ్ అభిప్రాయాలకూ, రామకృష్ణ పరమహంస బోధనలకూ సారూప్యం ఉంది.

టాల్‌స్టాయ్, భారతీయ మతచింతనాపరులు విశ్వజనీనతకోసం కృషిచేశారు టాల్‌స్టాయ్ కథలు రెండుదేశాల సాంస్కృతిక అవధులను దాటగలిగాయి. అవి టాల్‌స్టాయ్ నవలలు చాలాకాలంగా చేయలేని పని చేశాయి. సోవియట్ సాహిత్య చరిత్రకారులూ, సోవియట్ పాఠకులు టాల్‌స్టాయ్ కథలకు ద్వితీయ ప్రాముఖ్యతనిచ్చారు. మనదృష్టిలో ఆయన నవలలు "ప్రజలకోసం కథల" ను మబ్బులా కమ్మివేశాయి. రష్యన్ సంస్కృతి వెలుపల టాల్‌స్టాయ్ కథలు అందుకన్న ఉన్నత స్థానం మూలంగా మనం ఆయన కథలపట్ల మరింత శ్రద్ధాసక్తులు చూపవలసి వుంది.

టాల్‌స్టాయ్ రాసిన "ప్రజలకోసం కథల"ను గురించి రోమారోలా ఏమి చెప్పాడో చూడండి: "సమస్త ప్రజలకూ కళను సృష్టించాలనుకున్న టాల్‌స్టాయ్ అచిరకాలంలోనే విశ్వజనీనతను సంతరించుకున్నాడు. ఆయన కథలు శాశ్వత ప్రపంచవ్యాప్త ఖ్యాతి నార్జించాయి. ఎందువల్లనంటే అవి కళలోని తాత్కాలిక అంశాలను విసర్జించాయి.; వాటిలో శాశ్వతవిలువలు తప్ప మరొకటి లేదు"

టాల్‌స్టాయ్ రాసిన "ప్రజలకోసం కథలు" ప్రశంసలు పొందింది ఒక్క భారతదేశంలోనే కాదు. మన శతాబ్దంలోనే గణుతికెక్కిన గొప్ప ఆస్ట్రియా తత్వవేత్త, లుడ్విగ్ విట్‌జెన్‌స్టీన్ మొదటి ప్రపంచయుద్ధకాలంలో, రష్యన్ యుద్ధరంగంలో ఒక అధికారిగా వుండి, ఈకథలు చదివాడు. అవి ఆయనను ఆకట్టుకున్నాయి. "ప్రజలకోసం కథలు" వల్లనే టాల్‌స్టాయ్‌ని ఆయన గొప్ప రచయితగా పరిగణించారు. "యులిసిస్" రాసిన సుప్రసిద్ధ రచయిత జేమ్స్‌జాయిస్ యిలా అంటున్నాడు: ".....ప్రపంచ సాహిత్యంలోకెల్లా 'మనిషికి ఎంత నేలకావాలి' గొప్ప కథ అని నాఅభిప్రాయం."

ఈవిధంగా, టాల్‌స్టాయ్ రచనల పాఠకుడుగా గాంధీ అనుభవం పైకి అసమగ్రమైనదీ, అసంపూర్ణమై నదిగా మొదట కనిపించినా, దానిలో మనకింకా తెలియని అంతర్గత విజ్ఞత వుందని నిలకడపై తేలవచ్చు.

# ట్రాయ్‌కు మొహంజొదారోల కన్నా ప్రాచీన నగరం

దక్షిణాది ఊరల్స్‌లో జరిపిన తవ్వకాల్లో బయటపడ్డ ఆర్కేయిమ్‌నగరం ట్రాయ్, మొహంజొదారోలకన్నా వెయ్యి సంవత్సరాలు ప్రాచీనమైనదని గెన్నది జ్దానొవిచ్ (చరిత్రక్యాండిడేట్) దీని చరిత్రను తెలియజేస్తున్నారు. ఆతవ్వకాల పక్కనేగల పర్వతంపేరునే ఈనగరానికి పెటారు.

ఈచిన్న శిలా విగ్రహాలు ఒకదాన్కొటి చాలావరకు పోలివున్నాయి. ఎడమవైపున వున్న విగ్రహం దక్షిణాది ఉరల్స్‌లో, కుడివైపున వున్న విగ్రహం ఈస్టర్ ఐలాండ్‌లో లభించింది.





ఈనగర వైశాల్యం 20,000 చదరపు మీటర్లు. యిది ఒక ప్రార్థనా మందిర సముదాయం కావచ్చు. దీనిచుట్టూ నివసించిన జనాభాలో అత్యధికులు రైతులని అక్కడ బయటపడ్డ పంటకాల్వల గుర్తులను బట్టి తెలుసుకోవచ్చని జ్డానొవిచ్ అన్నారు.

ఈనగర ప్రజలు సూర్యుణ్ణి ఆరాధించేవారు. పాతపింగాణీ పాత్రలపైగల స్వస్తిక్ గుర్తులు, వలయాకారంలో నిర్మించబడిన యీనగరం యిందుకు రుజువు అని ఆయనంటారు.

స్వస్తిక్ ఒకప్పుడు సూర్యునికి గుర్తు. చతురస్రం భూమికి గుర్తు. భూమికి నాల్గుదిశలుంటాయని కనుగొన్నదీ, **చతురస్రాకారంలో** యిళ్లను నిర్మించినదీ ప్రాచీనకాలంలోనే, ఊరల్స్‌లో, కజక్ స్టెప్పీలలో వలయాకారపు, చతురస్రాకారపు యిండ్లను పురాతత్వవేత్తలు కనుగొన్నారు. వీరు విభిన్న తాత్విక భావాలు కలవారని ఆయన అభిప్రాయం.

ప్రాచీనకాలంలో ఊరల్స్‌లో, కజక్ స్టెప్పీలలో నివసించిన ప్రజల చరిత్రపై అర్కెయిమ్ వెలుగును ప్రసరింపజేస్తోంది. అనేక ఎముకల పలకలతో తయారుచేసిన గుర్రపు ముస్తాబులు, అడవి గుర్రాలదొడ్లు, సమాధుల్లో రథాల — యివన్నీవారు గుర్రాన్ని మచ్చిక చేసుకొన్నట్లు తెలియజేస్తున్నాయి. ప్రాచీనార్యులు రెక్కలుగల దేవతను పూజించేవారుకదా. మహత్తర ప్రాచీన నాగరికతల ప్రగతికి పూపు **లభించింది,** గుర్రాలను మచ్చిక చేసుకోవడంతోనే కదా?

ప్రాచీ నార్యులు నివసించిన ఆర్కేయమ్ నగరం. విహంగ దృష్టి





# ఆత్మ రక్షణా ప్రవృత్తి

లియోనిడ్ బ్రెయర్





చిత్రరచన: యూరి ఇగోరెవ్

చెప్పదలచుకున్నదేదో చెప్పండి. జీవితం ఆసక్తికరంగా రూపొందుతోంది. స్వేచ్ఛా వాయువులను పీల్చడానికి ప్రతిఒక్కరూ త్వరపడుతున్నారు, అది యేక్షణాన బిగుసుకుపోతుందోననేతిదుర్దాతో.

మీరు కునికిపాట్లు పడడానికి వీలులేనంత ఉత్సాహంగా సమావేశాలు జరుగుతున్నాయి. ఒకప్పుడైతే తమను భ్రష్టులని పిలిచివుండేవారని యీరోజు అభినందనలు పొందుతున్న వారంటున్నారు.

పరిమితులులేని ప్రజాస్వామ్యానికి నేను అలవాటు పడాల్సిన అవసరముంది. ''కాదు'' అనేది యింతకాలం శిలాక్షరంగా వుండగా ''అవును'' అని యీనాడు యెవరైనా అంటే నాకు అనుమానమేస్తుంది. పెంపుడుబాతుకు ఎగరడానికి అనుమతిచ్చినంత ఆనందాన్ని అనుభవిస్తున్నాను నేను. నేనేదో మొరటుగా కేకలు వేస్తున్నట్టు, దూషిస్తున్నట్టు నాకనిపిస్తుంది. అప్పుడు నాఅంతరాత్మ యిలా ప్రభోదిస్తుంది: ''నోర్మూయి! యిది మనచరిత్రలో కేవలం మరో మలుపు, అంతే''

నేను నోరుమూసుకున్నాను. నాకు భయమేస్తోంది. అలాంటి తిరోగమనాలను ఎన్నోచూశాను. ''అందరూ అనుకూలమేనా?'' అనే మాట వినబడితేచాలు నిద్రలోకూడా చెయ్యెత్తేవాణ్ణి. విమర్శించాలంటే విమర్శించే వాణ్ణి, బలపర్చాలంటే బలపర్చేవాణ్ణి. ఓటు పత్రంపైగల పేరును కొట్టివేశానని అనుమానపడుతారేమోనని నేను పోలింగ్ బూత్‌కు యెప్పుడూ వెళ్లలేదు. అందువల్లనే నామనను ప్రజాస్వామ్యానికి చాలా నెమ్మదిగా అలవాటు పడుతోంది.

ఇటీవల మావాళ్లు కొత్త డైరెక్టరును ఎన్నుకున్నారు. యీపదవికి యిద్దరు పోటీచేశారు. ఇందులో ఒకరిని పైవారు నియమించారు. యీయన నిఖార్సయిన వ్యక్తి అనేముద్ర అది. మరొకరు నకిలీ అభ్యర్థి. ఓటర్లు యీయనను కూడా ఎన్నుకోవచ్చు. నాకు యీనకిలీ అభ్యర్థి అంటేనే యిష్టం. ఆయనను బలపరుస్తూ నేను మాట్లాడదలిచాను. దేవుడు మేలుచేసి నాకు సకాలంలో ఓవిషయం గుర్తొచ్చింది. ఆయన గెలువకపోతే నాబతుకేంగాను? అది పూర్తిగా కరెక్ట్.

పైఅధికారులతో నేనెప్పుడూ తగవుపడలేదు. ఇది నానియమం. యిందులోని రహస్యమేమిటో తెలుసా? నేను ఒకరికి దాసోహం అంటే నాకు ఒకరు దాసోహం అంటారు. అయితే అధికారి చెప్పినట్టు చేయడంకూడా కష్టమైపోయింది నాకు. ఓసమావేశం జరిగే ముందు మాఅధికారి నాతో యిలా అన్నారు: ''నాకోసాయం చెయ్యాలి. సమావేశంలో నన్ను ఎండగట్టు. యిది యిప్పుడు అవసరం'' ఆయన నన్ను పరీక్షిస్తున్నాడని అనుకొని నేనాపని చేయలేనని ప్రాధేయపడ్డాను.

నేనేతగాదాల్లో పడదలుచుకోలేదు. నీవేమి ఆలోచిస్తున్నావో నీపైఅధికారికి పట్టని విషయమేమీ కాదు. ''మీ అభిప్రాయమేమిటి? మీరేమి ఆలోచిస్తున్నారో నేను తెలుసుకోదలచుకున్నాను'' అని ఆయన అంటున్నాడు. నాకు తెలిసినంతవరకూ నాకో అభిప్రాయం లేదు; యేదైనా వుంటే దాన్ని దాచుకుంటాను. నాఅభిప్రాయం యెలావుండాలని ఆయన అనుకుంటున్నాడో నాకు తెలియనప్పుడు నా అభిప్రాయాన్ని నేను యెందుకు చెప్పాలి.

నిరసన లేఖలనే తీసుకోండి. ఫ్యాక్టరీ కార్మికులు, పేటల్లోని వారు, ప్రయాణీకులు మహాజర్లు సమర్పిస్తున్నారు. యివంటే నాకు చీదర అయితే యిదెవరికీ కనిపించనివ్వను. ఇక శాంతికోసం, సైనిక నియంతను ఖండించడంకోసం ఉద్దేశించిన మహాజర్లంటారా! వాటిపై కళ్లు మూసుకొని నంతకాలు పడేస్తాను.

ఈమధ్య ఓఉత్సాహవంతుడు దారిలో నన్ను ఆపి నిరసన పత్రంపై సంతకం చేయాలని కోరాడు. త్వ్యాత్సెప్ కవి ఒకప్పుడు నివసించిన యింటిని కూల్చివేసే పథకానికి నిరసన తెలిపే పత్రమది. నేను త్వ్యాత్సెప్ కవితలను చదువలేదనీ, అందువల్ల ఆపత్రంపై సంతకం చేయననీ ముక్కుసూటిగా చెప్పాను.

అసలు విషయం త్వ్యాత్సెప్ కాదు. ఆయన కవితలను నేను చదివాను. ఒక శుభదినాన యెవరైనా వచ్చి ఫలానా సంవత్సరంలో దేశద్రోహానికి పాల్పడ్డావని యీనిరసన పత్రాన్ని ఆధారంగా చూపుతూ నన్ను వేధించరనే గ్యారంటీ యెక్కడుంది? యీనిరసన పత్రాలన్నిటినీ భద్రపరుస్తా

రు కదా. అందులో యెవరేమిటో తెలిపే జాబితా వుంటుంది. అవసరమైనప్పుడు దాన్ని ప్రయోగిస్తారు.

సాహసవంతుల, నేటి దురుసుతనంగల వారందరి పేర్లను మనలో కొందరు రహస్యంగా నమోదుచేస్తున్నారని నాభయం. నాభయానికి ఆధారంలేక పోవచ్చు కాని అది నన్ను భూతంలా వెంటాడుతోంది. అందువల్ల నేను వాదోపవాదాల్లోకి దిగడంలేదు. ఎవరైనా జోకులు వేస్తే విరగబడి నవ్వడంలేదు.

ప్రజాస్వామ్యం అనేది వినసొంపైన మాట. అది మనశ్శాంతి లేకుండా చేస్తుంది. అది ప్రజలను గందరగోళపరుస్తుంది. పిల్లలుకూడా బోరవిప్పి నడుస్తారు. ఐదేళ్ల కుర్రకుంక కూడా ''గౌరవించడం నేర్చుకో'' అని రాజ్యాంగ చట్టాన్ని గుర్తుచేస్తాడు. ఏడవతరగతి చదువుతున్న మాఅమ్మాయి నాగుండే ఆగిపోయేంత పనిచేసింది. ఆమె యేమన్నదో తెలుసా? ''నాకో సాయం చెయ్యండి - ఒక సమస్యను పరిష్కరించండి. ఒక వస్తువు తాలూరు వెగక్షయ యంత్రాంగం, వేగ వృద్ధి యంత్రాంగమంతటి శక్తివంతంగా వుంటే ఆవస్తువు యెంతవేగంతో కదులుతుంది?''

నాకు చెమట పట్టింది. నాపొరుగువాళ్లు వెంటనే గుర్తొచ్చారు. యిది వారు వింటే నామీద పిర్యాదు చేస్తారు. ''నీవేం పేలుతున్నావ్?'' అని గోడలకు చెవులుంటాయన్నట్టు నెమ్మదిగా అడిగా

ఆమె నోట్ బుక్ తెచ్చి నాకు చూపెట్టింది. వేగవృద్ధి, వేగక్షయ అనే మాటలు అందులో వున్నాయి.

గుండె ఆగిపోకుండా నేను ఔషధం తినుకుని మంచంపై పడుకున్నా. నాడి వేగం హెచ్చినట్టు నాకనిపించింది. ఎందుకబ్బా? కారణం, నేను స్తబ్దితా కాలపు బాధితుణ్ణి.

అయితే నేనెప్పుడు బెంబేలెత్తలేదు. మానవుడు దేనికైనా సర్దుబాటు అవుతాడు. స్వేచ్ఛకు కూడా. అయితే యిదంతా యేరూపం తీసుకుంటుందో వేచి చూడాలి, అంతే.

(మాస్కో న్యూస్ వారపత్రిక నుండి)

## ప్రత్యేక సమాచారం

### 1088 ఒలెంపిక్ పోటీలకు......

ప్రపంచపోల్ - జంప్ ఛాంపియన్ సోవియట్ క్రీడాకారుడైన సెర్గేయ్ బూప్క పేరు ఎనిమిదవసారి రికార్డుల పుస్తకంలో కెక్కింది. చెకోస్లోవాకియాలో జరిగిన అంతర్జాతీయ పోటీలో ఆయన 605 సెం.మీ. ఎత్తుదూకారు. 1984 నుండీ ఆయనకు ప్రపంచ రికార్డులో ఎదురులెదు.



### ఏడు దశాబ్దాల సోవియట్ పెయింటింగ్స్

ఎవ్‌సేయ్ ఎవ్‌సేయెవిచ్ మొయ్‌సేయెంకో (1896 జననం) సోవియట్‌యూనియన్ ఆర్ట్స్ అకాడమీ సభ్యుడు. లెనిన్ బహుమతి విజేత. సోవియట్ ప్రజా చరిత్రలోని సంతోష విషాద ఘటనలను ఆయన తన పెయింటింగ్స్‌లో మూర్తిభవింపజేయడానికి ప్రయత్నించాడు. తన పెయింటింగ్స్‌లో ప్రముఖ రష్యన్ కవి అలెక్సాండ్ర్ పుష్కిన్ (1799 - 1837) కు ప్రత్యేకస్థానమిచ్చాడు.

## టూకీగా



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M277 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |